# ఆంధ్ర ప్రదేశ్


సంపుటి 1 | అక్టోబరు, 1957 | సంచిక 12

ఆశ్వయుజము, శాలివాహనశకము-1879






"శ్రేయోరాజ్యంలో విశ్వవిద్యాలయాలపాత్ర" అను విషయంపై హైదరాబాదులోని ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 23-9-1957 తేదీన జరిగిన విద్యార్థుల జాతీయగోష్ఠిని ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ ప్రారంభించారు.



హైదరాబాదు నగరంలో నెలకొల్పబడిన ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ చేతిపరిశ్రమల షోరూముకు రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.



# ఆంధ్రప్రదేశ్

సంపుటి 1

అక్టోబరు, 1957
ఆశ్వయుజము, శాలివాహనశకము - 1879

సంచిక 12

## విషయసూచిక



— చందా —
సాలుసరి రు. 1—8—0
లేక
ఒక రూపాయ 50 న.పై.

విడిప్రతి 0—2—0 లేక
12 నయా పైసాలు

ఆంధ్రప్రదేశ్ సమాచార పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి అజంతా ప్రింటర్సులో ముద్రింపబడినది.

# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును భారత ప్రభుత్వ చిన్న మొత్తముల పొదుపు పథకంలో పెట్టుబడి పెట్టండి!

*భారత దేశంయొక్క*

సామాజికాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు,

రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి సహాయపడండి!

*మీ డబ్బును ఈ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| *12 సంవత్సరముల ట్రెజరీ ప్లాన్ సేవింగ్స్ సర్టిఫికెట్లు* | మెచ్చూరిటీ పొందినమీదట నూటికి ఏడాదికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 5,000 లవి కూడా లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| *10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు* | ఏడాదికి నూటికి 4 వంతులు చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఒకొక్కరు రూ. 100 లవి మొదలు రూ. 25,000 లవి కూడాలభిస్తాయి. |
| *పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు* | డిపాజిట్లపై రూ. 10,000 ల వరకు నూటికి $2\frac{1}{2}$ వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. శేషముపై రూ. 15,000 ల వరకు నూటికి 2 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. |

### 15 సంవత్సరముల ఆన్యూటీ సర్టిఫికెట్లు

| | |
|---|---|
| జారీచేయబడు ధరలు: రూ. 3,500, రూ. 7,000, రూ. 14,000 రూ. 28,000 వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 28,000ల వరకు కొనవచ్చును. | నూటికి ఏడాదికి $3\frac{1}{2}$ వంతుల చక్రవడ్డీతో నెలసరి వాయిదాలుగా 15 ఏండ్ల లోపున తిరిగి చెల్లించబడుతవి. |

## *ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!*

## *భారతదేశ ఉజ్జ్వల భవిష్యత్తుకొరకై పెట్టుబడి పెట్టండి!*

ఇతర వివరములకు, ఈ పెట్టుబళ్ళకు సంబంధించిన నియమావళికొరకు:

**నేషనల్ సేవింగ్సు కమీషనర్, సిమ్లా చిరునామాకుగాని లేక**

**రీజనల్ ఆఫీసరు, హైదరాబాదు (దక్కన్)**

చిరునామాకు గాని వ్రాయవలెను.

# వన్యమృగ సంరక్షణ

శ్రీ పి. తిమ్మారెడ్డి
(రాష్ట్ర వ్యవసాయ అటవీశాఖల మంత్రి)

*వన్యమృగ వారోత్సవ సందర్భంలో ఆంధ్ర ప్రదేశ్ అటవీశాఖ మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డిగారు హైద్రాబాదు రేడియో నిలయంనుండి 30-9-1957 తేది రాత్రి వన్యమృగ సంరక్షణను గూర్చి ప్రసంగిస్తూ ఇలా అన్నారు :*

అడవులను ఏవిధంగా రక్షించుకొనవలయునని మనము శ్రద్ధ చూపుచున్నామో, అడవి జంతువులను కూడ రక్షించుకొనుటలో మనము సమానమైన శ్రద్ధ ఉత్సాహము చూపవలసియున్నది. అడవి అంటేనే మన మానస ఫలకములో పర్వతాలు, లోయలు, చెట్టు చేమలు, జంతువులు, పక్షులు గోచరిస్తాయి. అడవులు, అడవి జంతువులు ప్రకృతి పరిణామములో ప్రధాన భాగాలు. స్తబ్ధ ప్రకృతికి లేని అందము, విన్యాసము మృగసమన్వితమైన అరణ్య పరిసరాలకున్నది. కనుల పండువుజేసే అటవీ మధ్యములో బెదురు చూపుల జింక ఎంత అందంగా కనబడుతుంది ? బిక్కు బిక్కుమనే భీకరారణ్యములో కూహూ అనే కోయిల, పింఛము విప్పి ఆడే నెమలి, ఎంత ఆప్తభావము నెలకొల్పుతాయి ?

వన్యమృగ సంరక్షణము మనకు క్రొత్తకాదు. మధ్యయుగములో మన సంస్కృతిని మనము మరచి పోయినట్లే వన్యమృగ సంరక్షణావశ్యకతను గూడ మరచిపోయినాము. వేట సప్తవ్యసనాలలో ఒకటని మన పురాణాలన్నీ చెప్పుచున్నవి. ప్రజలకు హాని కలిగించే క్రూరజంతువులను మట్టుకే వేటాడవలసిందని మన పూర్వరాజుల నియామకము. కౌటిల్యుడు తన అర్థశాస్త్రములో కూడా వన్యమృగాలను రక్షించవలసిన బాధ్యత రాజులపై నున్నదనీ, వాటిశరణ్యము కోసము అభయారణ్యాలు నెలకొల్పవలసిందనీ వ్రాసినాడు. అహింసా సిద్ధాంతాలను ఆచరణలో పెట్టిన అశోక చక్రవర్తి అడవిమృగాల నేవిధంగా రక్షించవలయునన్న ఆదేశాలను తన రాతిశాసనాలపై చెక్కించినాడు. ఇప్పుడు కూడ ఢిల్లీలో అశోకుని అయిదవ శాసనముపై ఇట్టి ఆదేశాలున్నాయి. జహంగీర్ మొదలగు మొగలాయీ చక్రవర్తులుగూడ అడవిజంతువులపై చాలా శ్రద్ధ కనుబరచినారు. మొగలాయీ కాలపు తైలవర్ణ చిత్రాలలో చక్రవర్తుల మూపురాలమీద, రాణుల చేతుల్లో అందమైన చిలుకలను మీరు చూచేయుంటారు.

మనదేశములో ఖడ్గమృగాలు, సింహాలు, ఏనుగులు, పులులు, చిరుతపులులు ప్రతి రాష్ట్రములో పూర్వకాలమందున్నట్లు నిదర్శనాలున్నాయి. ఇప్పుడు సింధు, పంజాబులలో మన్య ప్రాంతమైన మహంజదారో, హరప్పనగర స్థలాలలో సుమారు 5000 ఏండ్ల క్రింద ఖడ్గమృగాలు సంచరించు చుండినట్లు, అచట త్రవ్వి తీయబడిన బొమ్మలు, విగ్రహాలు, నాణ్యాలు మొదలైన వాటివల్ల తెలియుచున్నది. మహమ్మదీయ చరిత్రకారుడైన ఫెరిష్తా తన ప్రయాణాల్లో కడప, కర్నూలు ప్రాంతములో ఏనుగులున్నట్టు వర్ణించినాడు. 1652 సంవత్సరములో చంద్రగిరి రాజును దర్శించడానికి వచ్చిన జీన్‌బాప్టిస్టు ట్రావర్నియర్ తిరుపతి దగ్గర శేషాచలము కొండల్లో అడవి ఏనుగులను చంద్రగిరిరాజు పరివారము బంధించువైనమును జూచి తన యాత్రా గ్రంథాలలో వ్రాసినాడు. అది వింటే కఱవు కాటకాల కాటపట్టయిన కడప చిత్తూరు జిల్లాలలో అడవిఏనుగు లుండదగిన అడవు లుండినాయని మనము నమ్మలేము. సంపూర్ణంగా అంతరించిపోతున్న సింహానికి కేంద్ర ప్రభుత్వము రక్షణ కల్పించడము ద్వారా సౌరాష్ట్రములో

గిర్ అడవులలో సింహము దినదినాభివృద్ధి జెందు చున్నది. అస్సాములోకూడా అంతమగుచుండిన ఖడ్గ మృగము అభయారణ్యాలలో అభివృద్ధి చెందు తున్నది.

అరణ్యాలను మనము నాశనముచేస్తూ వచ్చినాము. నివసించే ప్రదేశాలు లేకపోవుటచేత, వేట నెపముతో కనపడిన జంతువులను కాల్చి చంపడముచేత అడవి జంతువులు అంతరించి పోసాగినవి. రెండవ ప్రపంచ యుద్ధకాలములో మన అటవీ సంపద, జంతు సంపద చాలా నాశనమైంది. అరణ్య యుద్ధ శిక్షణ అనే నెప ముతో తెల్లసైన్యాలు మన అడవులలో శిబిరాల నేర్పఱచుకొని, రాత్రింబవళ్లు షికారుచేసి మృగాలను మారణ హోమము చేసినారు. జీపుల సహాయముతో, కన్నులకు మిరుమిట్లు గొలిపే విద్యుచ్ఛక్తి దీపాలతో, శక్తివంతమైన మారణ యంత్రాలతో కనబడిన మృగాలనన్నీ కాల్చివేసినారు. నక్కల కంటె వేరే జంతువే లేని పాశ్చాత్య పాలకులు మనదేశములో వేటను చాలా ప్రోత్సహించినారు. కాని వారు చట్ట బద్ధంగా ప్రవర్తించేవారు. వారి ననుకరించే మన యువకులు చట్టవిరుద్ధంగా చంపడమే ఆనందంగా భావించి బాధ్యతారహితంగా మృగయావినోదము అల వాటు చేసుకొన్నారు.

మృగయావినోదము బొత్తిగా నిషేధించమని నేను చెప్పడములేదు. కాని క్రమబద్ధమైన వేటను మాత్రమే అనుసరించమని నేను కోరుచున్నాను. అసహాయమైన జంతువులను, మానవునివలె యోజించ లేని మూగజీవులను, యుక్తులెరిగిన మనము శాస్త్ర పరిజ్ఞానమున్న మనము, ఆధునిక మారణయంత్రాలు కలిగిన మనము చిత్రవధ చేయడములో ఏమిగొప్ప యున్నది? రైఫుల్‌తో వేటాడేబదులు, కెమేరాలతో వేటాడితే ఎంత బాగుంటుంది? తాము చంపిన పులి చర్మాలలో దూదిదూర్చి ట్రోఫీలుగా యింటపెట్టుకొనే దానికంటె తాము ప్రమాదము నెదిరించి దగ్గరగా పోయి కెమెరాతోతీసిన చలనచిత్ర మెంత ఆనందము కల్గిస్తుందో యోచించండి.

రాజులు, జమీందారులు తమ అడవులలో మృగా లను జాగ్రత్తగా కాపాడుచుండినారు. సంస్థానాలు, జమీందారీలు రద్దుచేయబడిన తర్వాత వీరి అధికా రాలు ప్రజలకు సంక్రమించినాయి. బాధ్యత గుర్తిం చక మనము అడవిమృగములను ఇష్టానుసారముగ చంపివేశినాము.

1952 లో తయారుచేసిన నూతన జాతీయ అటవీ విధానములో అడవి జంతువుల రక్షణకు ప్రాముఖ్య మియ్యబడింది. కేంద్ర వన్యమృగ రక్షణబోర్డు స్థాపించబడింది. అదేవిధంగా ప్రతి రాష్ట్రానికి రాష్ట్ర వన్యమృగ రక్షణబోర్డు స్థాపించబడింది. ప్రజలలో వన్యమృగ రక్షణావశ్యకతను గూర్చి ప్రచారము చెయ్యడము, ప్రభుత్వాలకు అడవి జంతువుల విషయ ములో కావలసిన చట్టాలు చేయడములో సలహాలు ఇవ్వడము యీ బోర్డుల కర్తవ్యము.

ప్రతి రాష్ట్రములోను, అడవి జంతువుల శాంతి భద్రతలకోసము అభయారణ్యాలు నిర్మింపబడు తున్నవి. అస్సాములోని కజిరంగ అభయారణ్యము, తిరువాంకూరు - కొచ్చిన్‌లోని పెరియారు అభయా రణ్యము, మైసూరులోని బందీపూర్ అభయారణ్య మును గూర్చి శ్రోతలు వినేయుంటారు. అట్టి అభయా రణ్యాలు చిన్నస్థాయిలో మన రాష్ట్రములో కూడా తెలంగాణా జిల్లాలలో మూడున్నాయి. వీటిలో ప్రజలు ప్రవేశించి వన్యమృగాలను వాటి సహజపరిసరాలలో వీక్షించేందుకు తగినసౌకర్యాలు తక్కువగా యున్నాయి. ఈ సౌకర్యాలు హెచ్చుచేసుకోవాలి. చిత్తూరు జిల్లా లోని మామండూరు లోయలో శ్రీ వెంకటేశ్వర అభయారణ్యము నెలకొల్పుటకు పథకాలు తయా రుగా నున్నవి. ధనాభావమువల్ల యీ సంవత్సరము దీనిని అమలుపరచలేక పోయినాము. నాగార్జునసాగర్ దగ్గర ఒక అభయారణ్యము నెలకొల్పుటకు పథకాలు తయారగుచున్నవి.

రేపటినుంచి ఒక వారముదినాలు దేశమంతటా వన్యమృగ రక్షణ వారోత్సవాలు జరుపబడుతవి. మన రాష్ట్రములోకూడ యీ ఉత్సవాలు ఉత్సాహముతో జరుపుటకు రాజధానిలోను, జిల్లాలలోను ఏర్పాట్లు చురుకుగా సాగుచున్నవి. ఈ ఉత్సవాలలో పాల్గొని అడవి మృగాల శ్రేయస్సుపై మీకున్న శ్రద్ధ నిరూ పించుకొనండి. జాతి సంపదయైన వన్యమృగ సంప దను రక్షించుకొనవలయునంటే అటవీ సంపదను మనము భద్రముగా కాపాడుకొనాలి. ఈ రక్షణ ప్రయ త్నాలలో మీరంతా ప్రభుత్వానికి తోడ్పడి, వాటిని విజయవంత మయ్యేటట్లు చేస్తారని ఆశిస్తున్నాను.



## వన్యామృగ వారోత్సవం:

# అడవులను, అడవిమృగాలను సంరక్షించెదమని అంతా ప్రతిజ్ఞ చెయ్యాలి

శ్రీ సి.వి.కె. రెడ్డి, బి. ఏ., ఏ. ఐ. యఫ్. సి.
(అడవుల సహాయక సంరక్షకాధికారి; రాష్ట్రవన్యమృగ వారోత్సవాల నిర్వహణ సంఘ కార్యదర్శి)

మానవుడు అనాలోచితంగా ఒక వస్తువును ధ్వంసం చేస్తాడు. ఆ తరువాత అయ్యో దాన్ని ధ్వంసంచేసితినే అని పశ్చాత్తాపంజెంది అందుకు నష్ట పరిహారంగా మరొకదాన్ని సృష్టించడానికి ప్రయత్నిస్తాడు. నాగరికతవైపుకు పురోగమించే దృష్టితో అడవులను కొట్టివేసి ఆవాసం ఏర్పరచుకుంటాడు. మళ్ళీ తాను నివసించే ఆవరణం పచ్చపచ్చగా వుండాలని ఏవో చెట్లు వేసుకుంటాడు. దీనికి కారణమేమిటి అంటే ఇప్పుడంటే మానవుడు నాగరికుడైనాడు కాని, అసలు ఆదిలో అతడు పుట్టిందీ పెరిగిందీ ప్రకృతిమధ్యనేకదా! కనుకనే ప్రకృతిని మరచిపోలేడు. అలాగే వన్యమృగాలను తుపాకీతో కాల్చి



ఆహారంకొరకు పొంచివున్న బెబ్బులి.

— ఫొటో : శ్రీ యన్. భగవాన్‌దాసు, ఐ. ఏ. యస్.



ఆకు కూడా కదలని అరణ్యంలో దుప్పి పిల్ల

చంపుతాడు. అయితే అతనిలో భూతదయ వుంది. జంతుజాలంపై ప్రేమ వుంది. అందుచేతనే ఇంట్లో జంతువులను పెంచుతూవుంటాడు. ఆదిమకాలంలో రాజ్యాలూ సమాజాలూ లేవు. మానవుడు ఆటవిక జీవితం గడిపేవాడు. ఆ కాలంలో జీవించడం, ప్రేమించడం, ఎంత ఆవశ్యకమైందో జంతువధ చేసి పొట్ట నింపుకోవడంకూడా అంతేఅవసరమైంది, మానవుడికి. అయితే మానవుడు ఇప్పుడు అడవిమనిషి కాడు. అతనిలో మంచిచెడ్డల విచక్షణ జ్ఞానంవుంది. కాబట్టి జంతువులను చంపి వినోదించడం, అదే కాలక్షేపముగా పెట్టుకోవడం, ఇలాంటి పనులు వాంఛనీయమైనవి కావు.

ప్రకృతిని చిత్రిస్తున్నప్పుడు అందులో ఒకపక్షిని గాని, ఒక జంతువునుగాని చూపకపోతే ఆ వర్ణచిత్రం సహజంగా అందంగా వుండదని చిత్రకారులంటారు. ప్రకృతి చిత్రణకు ఒక జంతువు రూపం అంత శోభ నిస్తే అడవి మృగాలవల్ల అడవికి ఎంత వాస్తవికత, ఎంత పరిపూర్ణత వస్తుందో ఆలోచించండి. పెద్ద జూలుతో మృగరాజులా ఠీవిగా సింహం పోతూవుంటే, చేటలంత చెవులతో ఏనుగు మందగమనంతో వెడుతూవుంటే, పెద్దపెద్దచారలతో పొదలు దూకుతూ పెద్ద పులి పరుగెత్తుతూ వుంటే, కొమ్ములతో కారెనుము నడుస్తూ వుంటే, బెదురు చూపులతో జింకలు చెంగుచెంగున దూకుతూవుంటే రంగురంగుల ఈకలతో నెమలి నృత్యం చేస్తూవుంటే తీయని కంఠంతో కోయిల కూస్తూ వుంటే, అసంఖ్యాకమైన పక్షుల కిలకిలారావాలు వినిపిస్తూవుంటే ఆ అడవి ఎంత అందంగా, నేత్రపర్వంగా వుంటుంది!

ఇట్టి అడవులలోనే మన ప్రాచీన మహర్షులు తపోవనాలు నెలకొల్పుకున్నారు. ఆశ్రమాలు స్థాపించారు. ఆ ఆశ్రమాలలో పెద్దపులులు, జింకలు ప్రశాంతంగా తిరుగుతూ వుండేవట. కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో "అభయారణ్యము" ల ఆవశ్యకతను నొక్కిచెప్పాడు. "అహింసా పరమోధర్మః"

అన్నది హైందవ ఆర్యోక్తి అయినా వీటి నన్నిటినీ నిర్లక్ష్యంచేసి మనం నిర్దాక్షిణ్యంగా వన్యమృగాలను చంపుతూనే వున్నాము. తుపాకీ మందు కనిపెట్టబడడం, అనేక రకాల ఆధునిక రకపు తుపాకీలు తయారు కావడం, జీపుకార్ల ఉపయోగం, బ్యాటరీ టార్చిలైటు మొదలగు వాటివల్ల వన్యమృగాలు అసంఖ్యాకంగా వధింపబడుతున్నవి. కొందరు ఐరోపా ఖండపు స్త్రీలు బొచ్చుకోట్లకు బదులుగా చిరుత పులి చర్మంతో కోట్లు కుట్టించుకోవడానికి సరదా పడతారు. అలాంటి కోట్లకు రకరకాల చర్మాలు కావాలంటే ఒక్కొక్క కోటుకు కనీసం 20 చర్మాలు కావాలి. ఇక ఎక్కువ సంఖ్యలో వన్యమృగాలను చంపిన వారిని మహావీరుడనటం మనకు పరిపాటి అయింది.

## అమెరికా ఉదాహరణ

ఈ విషయంలో అమెరికా వారు మంచి గుణపాఠం నేర్చుకున్నారు. గతంలో వారుకూడా మనలాగే విచక్షణ లేకుండా అడవి మృగాలను చంపి అడవులలో అసలు చెప్పుకోదగ్గ వన్యమృగాలంటూ లేకుండా చేసుకున్నారు. అన్నీ పోగా నక్కలు మాత్రమే మిగిలాయి. కొన్ని ఐరోపా దేశాలలో నక్కను వేటాడి చంపడమే వినోదంగా మిగిలిపోయింది అమెరికావారు త్వరగా మేల్కొని వన్యమృగ పోషణ నిమిత్తమై పెద్దపెద్ద అడవులను, జాతీయ వనములను పెంచారు. ప్రతి సంవత్సరం దాదాపు నాలుగు కోట్లమంది యాత్రికులు ఈ వనాలను సందర్శించి, ప్రకృతిమధ్య అవి ఎలాతిరుగాడుతూ వుంటాయో చూచి ఆనందిస్తున్నారు



*కుందేలు - ఏమిటో ఆ ఆలోచన !*



*జింక*

— ఫొటో : శ్రీ యస్. భగవాన్‌దాస్, ఐ. ఏ. యస్.

ఆఫ్రికాఖండం వన్యమృగాలకు ప్రసిద్ధి చెందినది. అక్కడి అడవులలో ఏనుగులు, సింహాలు, జిరాఫీలు తిరుగుతూ వుంటాయి. ' అలాంటిచోట్ల కూడా వన్యమృగాలు లేకుండా పూర్తిగా హతమార్చటం అసాధ్యమైన విషయంకాదు. అందుచేతనే అక్కడి అధికార్లు ముందే జాగ్రత్తవహించి జాతీయవనాన్ని నెలకొల్పారు. క్రగ్గర్ జాతీయవనం ముఖ్యంగా చెప్పుకోదగింది. దానివిస్తీర్ణం 8000 చదరపుమైళ్లు.

తుపాకీతో వన్యమృగాన్ని కాల్చడంకంటె ఫొటో కెమెరాతో వాటి చిత్రాలను తీయడం వేటగాండ్రకు మిక్కిలి ఆనందోత్సాహాలను కలుగజేస్తుందన్న విషయాన్ని ఇప్పుడిప్పుడే అంతా గుర్తిస్తున్నారు. పాపం ఆ నోరులేని జంతువులు తమ పిల్లలకు పాలిస్తున్నప్పుడో, లేక ఆహారం తీసుకుంటున్నప్పుడో వాటిని చంపి ఆనందించడం మంచిదా ? అలాంటి

వాటిదృశ్యాలను ఏ సినిమాలోనో చూస్తూవుంటే మనకెంత ఆనందం కలుగుతుంతో యోచించండి

భారతదేశం పూర్వకాలంలో అనేక జాతుల వన్యమృగాలకు ప్రసిద్ధి కెక్కినది సింహం, ఏనుగు, పెద్దపులి, కారెనుము, అడవిదున్న, దుప్పి, పెద్ద పులి, చిరుతపులి, శివంగి ఇవన్నీ ఇక్కడి వన్య మృగాలు. సింధు పంజాబు ప్రాంతాలలో మొహంజోదారో, హారప్పాలవద్ద త్రవ్వకాలలో బయల్పడిన పురా వస్తువిశేషాలు, నాణెములు, బొమ్మలు, విగ్రహాములు మొదలగు వాటివల్ల ఆ ప్రాంతంలోని అడవులలో ఇప్పటికి 5,000 ఏండ్లక్రిందట ఖడ్గ మృగములు ఇతర వన్యమృగాలు వుండేవని తెలుస్తున్నది కాని ఇప్పుడక్కడ అడవులూ లేవు, అడవి మృగాలూ లేవు ఒకప్పుడు భారతదేశంలోని పలు తావులలో సింహాలుండేవి కాని ఇప్పుడు సౌరాష్ట్రి లోని గిర్ అడవులలో మాత్రమే వున్నవి. జునాగడ్ నవాబు, భారత ప్రభుత్వమూ దూరదృష్టితో అనుసరించిన సద్విధానంవల్ల ఇప్పుడు మనదేశ అడవులలో సింహాములసంఖ్య పెరుగుతున్నది అవి పూర్తిగా నశించిపోతాయనే భయం ఇక అక్కరలేదు వన్య మృగాలన్నిటిలో చిరుతపులి బహువేగంగా చురుకుగా పరుగుతీస్తుంది ఒకప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో చిరుతపుళ్ళు విశేషంగా వుండేవి కాని ఇప్పుడు ఇవి పూర్తిగా లేకుండాపొయ్యే ప్రమాదమేర్పడింది రాయలసీమలో ఏమైనా చిరుతపుళ్ళు వున్నాయేమోనని ఇప్పుడు వెదకుతున్నారు. వుంటే వాటిని



*శిక్షణపొందిన ఏనుగు కొత్తగా పట్టుబడిన ఏనుగును దారికి తెస్తూవుంది. మూడువేల ఏళ్ళక్రిందట మన అడవులలో ఎన్నో ఏనుగు లుండేవి. కాని ఇప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో బొత్తిగా లేవు.*

— ఫోటో : శ్రీ యన్. భగవాన్‌దాసు, ఐ. ఏ. యస్.



పునుగు పిల్లి

—ఫొటో. శ్రీ యస్ భగవాన్‌దాసు, ఐ ఏ యస్.

పట్టుకొని పోషించి వాటిజాతిని విస్తరింప జేయడానికి ప్రయత్నం చేయబడుతుంది అసలు ఇవి లేకుండా పోతాయేమోనన్న సంగతి ముందుగానే మనం గుర్తించివుంటే ఈ జాతిని మనం సంరక్షింప గలిగి వుండేవారం గదా!

1952 లో భారతప్రభుత్వం నిర్దేశించిన జాతీయ అటవీవిధానం వన్యమృగాలను సంరక్షించ వలెనని చెబుతున్నది భారతప్రభుత్వం భారత దేశ వన్యమృగ సంరక్షణకు ఒక బోర్డున కూడా నియమించింది రాష్ట్రప్రభుత్వాలు రాష్ట్ర బోర్డులను నియమించినవి ఆంధ్రరాష్ట్ర వన్యమృగ సంరక్షకబోర్డు రద్దయి పోయింది ఆంధ్రప్రదేశ్ వన్యమృగ సంరక్షక సలహా సంఘమును నెలకొల్పుటకు ఇప్పుడు ప్రయత్నాలు జరుగుతున్నవి.

రాష్ట్ర అటవీచట్టాలు వన్యమృగాలకు పరిమితమైన రక్షణను మాత్రమే కల్పిస్తున్నవి. అంతేగాక రిజర్వు అడవులలో నివసించే జంతువులకు మాత్రమే ఆ రక్షణ వర్తిస్తున్నది. అందుచేతనే వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు ప్రత్యేకంగా వన్యమృగ సంరక్షణకు శాసనాలను అమలులోకి తెచ్చి రిజర్వు అడవులలో గాని, ఇతరఅడవులలోగాని నివసించే వన్యమృగాలకు రక్షణ కల్పించినవి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంకూడా ఇట్టి శాసనాన్ని చెయ్యవలెనని ఆలోచిస్తున్నది.

## అభయారణ్యాలు

అడవి జంతువులకు రక్షణ కల్పించే ఉద్దేశంతో భారత దేశంలోని అనేక రాష్ట్రాలు అభయారణ్యాలను, జాతీయ వనములను నెలకొల్పినవి. ఉత్తర ప్రదేశ్‌లోని హేలీ జాతీయవనం, రాజాజీ అభయారణ్యం, అస్సాంలోని కజిరంగ అభయారణ్యం, మద్రాసులోని ముదుమలై అభయారణ్యం, మైసూరులోని బందీపూరు వన్యమృగముల రిజర్వు అడవి, కేరళరాష్ట్రంలోని పెరియార్ వన్యమృగ కేంద్రం ఇవి సుప్రసిద్ధమైనవి. విదేశీయులు కూడా వీటిని దర్శిస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో మూడు అభయారణ్యాలు వున్నవి. ఇవి పాఖాల, ఏటూరు నాగారం, పోచారములలో వున్నవి. చిత్తూరు జిల్లా మామండూరులో వెంకటేశ్వర అభయారణ్యమునూ, ఆదిలాబాదు జిల్లాలో కునాల్ వన్యమృగ కేంద్రమునూ నెలకొల్పడానికి భారత దేశ వన్యమృగ సంరక్షక బోర్డు వారు ఆమోదం తెలిపారు. ఖర్చులో కొంతభాగం భరించడానికి కేంద్రప్రభుత్వం సంసిద్ధతను తెలిపినప్పటికీ ఆర్థిక చిక్కులవల్ల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1957-58 లో వెంకటేశ్వర అభయారణ్య స్థాపనకు మంజూరీ ఇవ్వజాలకపోయింది. ఇది 1958-59 లో అమలు జరుగవలెనని తలపెట్టబడింది. మామండూరు లోయలో పెద్దపుల్లు విశేషంగా వున్నవి. కనుక అందులో వేటాడడం నిషేధింపబడింది. పర్యవసానంగా ఇప్పుడు అక్కడ పెద్దపుళ్ళ సంఖ్య, జింకల సంఖ్య పెరుగుతున్నట్లు తెలియవచ్చింది. 1952 లో జింకలు అరుదుగా కన్పించేవి. కాని ఇప్పుడు ఇవి అటవీ విశ్రాంతి గృహం ఆవరణలో కూడా విశేషంగా కన్పిస్తున్నవి. పెరియార్ అభయారణ్యం మాదిరిగానే నాగార్జున సాగరంవద్ద ఒక అరణ్యాన్ని పెంచవలెనని తలపెట్టబడింది. ఇది త్వరలో అమలు జరుగవచ్చు.

ప్రతి రాష్ట్రంలోని అటవీశాఖకు ప్రత్యేకంగా వన్యమృగశాఖకూడా వుండడం అవసరం. ఈ విషయంలో బొంబాయిరాష్ట్రం ఇదివరకే ముందంజ వేసింది. ఆర్థిక ఇబ్బందులు తొలగిపోతే మన రాష్ట్రములో కూడా ఇలాగే జరుగవచ్చు.

అయితే వన్యమృగాలను చంపకూడదు, వాటిని పెంపొందించాలి అన్న విషయాన్ని ఇప్పుడిప్పుడే ప్రజలు గుర్తిస్తున్నారు. ఇది ముదావహమైనసంగతి. అడవిలో వృక్షజాలమూ, జంతుజాలమూ రెండూ వుండాలనీ, వీటిలో ఒకటి తగ్గిపోయిందంటే రెండవ దానికికూడా దెబ్బతగులుతుందనీ మన వేటగాండ్రు గుర్తిస్తున్నారు. పెద్దపులి, సింహం, చిరుతపులి మొదలగు మాంసభక్షక మృగముల సంఖ్య తగ్గిపోయినప్పుడు, అడవిలో చెట్లుచేమలను పొదలను తినే జంతువుల సంఖ్య హెచ్చుతుంది. అవి అడవిలో మొక్కలను పొదలను పూర్తిగా తినివేస్తాయి. ఫలితంగా అడవి పెరగదు. అలాగే చెట్లు చేమలను తినే జంతువుల సంఖ్య తగ్గినప్పుడు మాంసభక్షక మృగాలకు ఆహారం లభించదు. అప్పుడవి గ్రామాల దగ్గరకొచ్చి ఆవులను, గేదెలను మనుష్యులను తినుట కలవాటుపడుతవి. కనుక మంచిదృశ్యాలు, శాస్త్రీయ విధానాలమాట అలావుంచి, మనుష్యుల ప్రాణాలను కాపాడడానికయినా అడవులను అందులోనిమృగములను సహజ సిద్ధంగా జీవించనివ్వడంమంచిది.

ప్రతి సంవత్సరం అక్టోబరు నెలలో వన్యమృగ వారోత్సవాలను జరిపి తద్వారా ప్రజలలో వన్యమృగ సంరక్షణపట్ల శ్రద్ధను కలిగించవలెనని భారత ప్రభుత్వం నిర్ణయించింది. 1956 లో ప్రథమ వన్యమృగ వారోత్సవం జరుపుకున్నాము. ఇప్పుడు 1957 లో రెండవ వారోత్సవం జరుపుకుంటున్నాము. ఈ వారోత్సవాల సందర్భంలో మనం ఈ క్రింది ప్రతిజ్ఞ గైకొనాలి.

"బుద్ధుడు, గాంధీమహాత్ముడు జన్మించి నటువంటి దేశంలో పుట్టిన నేను అడవులను, వాటిలో నివసించే నోరులేని మృగాలను బుద్ధిపూర్వకంగా, వ్యర్థంగా నాశనం చేయను."



# మూసీ ప్రాజెక్టు విశేషాలు

నదికి ఆనకట్ట కట్టలేదు, రిజర్వాయరు నిర్మాణం కాలేదు, కాని 2,000 ఎకరాలకు నీరు సప్లయి చేయబడింది

ఒక్క భారతదేశంలోనే కాదు, ప్రపంచంలో మరే ఇతర ప్రాంతంలోనూ జరగని విశేషం నల్లగొండ జిల్లాలో మూసీ ప్రాజెక్టు విషయంలో జరిగింది ఇది చాలా అసాధారణమైన ఫలితమని అంతా అంగీకరిస్తారు

1957 జూన్ 30 తేదీన రాష్ట్ర నీటిపారుదల విద్యుచ్ఛక్తి శాఖామంత్రి, స్పెషల్ చీఫ్ ఇంజనీరూ ప్రాజెక్టును సందర్శించినప్పుడు, ఈ ప్రాజెక్టునుంచి అంత త్వరగా భూములకు నీరు వదలబడుతుందని ఎవరూ అనుకోలేదు తమ భూములకు ఎప్పుడు నీరు వదులుతారా అని రైతులు ఎంతోకాలం నుంచి ఎదురుచూస్తున్నారు

*కాని స్పెషల్ చీఫ్ ఇంజనీరు కాస్త పరకాయించి చూచి నీరు వదలవచ్చు అన్నారు. ఈ భరోసా ఆధారంగా వచ్చే రబీ ఋతువులోగా 2,000 ఎకరాలకు నీరు సరఫరా చేయబడుతుందని మంత్రిగారు రైతులకు హామీ ఇచ్చారు*

*అలాగే జరిగింది అన్నమాట ప్రకారం నీరు వదలబడింది ఇందుకు చీఫ్ ఇంజనీరు కృషి, తాలూకా రైతుల పట్టుదల, ఉత్సాహము కారణమని చెప్పాలి*



*మూసీప్రాజెక్టు స్పిల్వే నమూనాను చూస్తున్న రాష్ట్ర నీటిపారుదలశాఖామంత్రి శ్రీ పి. వి. నరసింగరావు*



నిర్మాణంలో వున్న మిశ్రమ ఆనకట్ట.

మూసీ చాలా చిన్న ప్రాజెక్టు దీని ఖర్చు అంచెనా రూ 118 లక్షలు ఈ ప్రాజెక్టుపని అంత చురుకుగా సాగలేదు కారణం నిర్మాణం రీత్యా అనేక సమస్య లెదుర్కొన్నవి ప్రాజెక్టు స్థలమే ఎన్నో ఇబ్బందులు కలిగించింది. ఆ నేల అటువంటిది అక్కడక్కడా పెద్ద గోతులున్నవి అందుచేత ఇంకా ఎక్కువ లోతుగా త్రవ్వకం పనులు జరుపవలసిన అగత్యమేర్పడింది ఈ సమస్యలన్నిటినీ ఇంజనీర్లు ఎదుర్కోవాల్సి వచ్చింది. పర్యవసానంగా పని గమనం మందగించింది ఇప్పుడు వెళ్ళిచూచినా పని జరిగినట్లు అట్టే కన్పించదని భావింపబడింది కాని తీరా అక్కడికెళ్ళి చూస్తే ఆ అభిప్రాయమంతా మార్చుకోవలసి వచ్చింది.

## ప్రాజెక్టు నిర్మాణం

ఇంకా రిజర్వాయరు ఏర్పడలేదు ఎడమవైపు కాలువకు ఇంకా స్వరూప మేర్పడవలసి వున్నది ప్రాజెక్టు స్థలంవరకూగల సర్వీసురోడ్డు ఇంకా పక్కా కాలేదు కాని ప్రాజెక్టుదగ్గరి కెళ్ళి చూస్తే పని మాత్రం చురుకుగానే జరుగుతున్నట్లు కన్పించింది.

కుడివైపు కాలువ ఆరోజువరకూ 1,670 ఎకరాలకు నీరు సప్లయి చేస్తూవుంది అక్కడికి వేలాది గ్రామీణులు - పురుషులు, స్త్రీలు, పిల్లలు బండ్లు కట్టుకొని సభ చూడడానికి వచ్చారు వారి ముఖాలలో తాము అనుకున్నది సాధింపబడిందన్న సంతోషం, సంతృప్తి వ్యక్తమవుతున్నవి సభ నిమిత్తమై ప్రత్యేకంగా పెద్ద 'షామియానా' వేయబడింది నదిలో నీరు తక్కువగానున్నప్పుడు అప్రోచ్ కాలువలోకి నీరు పెట్టడానికై పంపులు ఏర్పాటు చేయబడ్డవి కుడివైపు కాలువనుంచి 11 పిల్లకాలువల గుండా పొలాలకు నీరు సరఫరా అవుతూవుంది ఈ విధంగా ఎంతో కాలంనుంచి మెట్ట సేద్యంక్రిందవున్న భూమి ఇప్పుడు మాగాణిగా మారుతోంది జపాను పద్ధతి వరిసేద్యంకూడా ప్రవేశపెట్టబడింది పెద్ద కాలువకు అడ్డంగా ఎక్కడయినా దారిలో వాగులు వచ్చినట్లయితే అట్టిచోట్ల తగు అక్విడక్టులు నిర్మింపవలెనని డిజైనులు తయారుచేయబడ్డవి. వాటి నిర్మాణం పూర్తి అయ్యేదాకా తాత్కాలికంగా ఆర్. సి. సి పైపులద్వారా లేదా టిన్ను రేకు తొట్లద్వారా కాలువ పారించబడుతూ వుంది మూసీరిజర్వాయర్

నీటి విస్తీర్ణం 8 చదరపు మైళ్ళు వుంటుంది ప్రాజెక్టు పనిలో 200 మంది సిబ్బంది పనిచేస్తున్నారు వారికొక కాలనీ ఏర్పాటయింది ఆ కాలనీలో అవసరమైన సౌకర్యాలన్నీ వున్నాయి. దాదాపు 2,000 మంది కార్మికులు ప్రాజెక్టు నిర్మాణంలో పనిచేస్తున్నారు

ఈ ప్రాజెక్టుపని 1954 జూన్‌లో ఆరంభమైంది చీఫ్ ఇంజనీరు తనిఖీచేసిన తరువాత మొదట అనుకున్న నిర్మాణ పథకం మార్చబడింది దీనివల్ల తక్కువ ఖర్చుతో రిజర్వాయర్ నిర్మించవచ్చు ఓగీ స్పిల్వే 17 నుంచి 26 చెయిన్సుకు హెచ్చింపబడింది మట్టికట్ట రెండువైపులా 64 చెయిన్సు వుంటుంది ఇప్పుడు 17 చెయిన్సు పొడవున నిర్మాణం పూర్తి అయింది యఫ్. ఆర్ యల్ 638 వుండాలని నిర్ణయింపబడింది దాని నీటి విసర్జక పరిమాణం 2,47,000 క్యూజెక్కులు

1957 ఏప్రిల్ 30 తేదీన చీఫ్ ఇంజనీరు తనిఖీ చేసి ఓగీస్పిల్వేను 65 చెయిన్సుకు పరిమితం చేయవలెనని సూచించారు వానిపై షట్టర్లు, వంతెన వుంటాయి రిజర్వాయర్ పరిమాణం 3,200 యం సి అడుగులనుంచి 4,500 యం సి అడుగులకు హెచ్చింపబడింది ఒకవైపు 8 చెయిన్సు, మరొకవైపు 6 చెయిన్సు నిడివితో మిశ్రమ ఆనకట్ట నిర్మింపబడవలెనని తలపెట్టబడింది ఈ విధంగా ప్రాజెక్టు ఖర్చు అంచెనాలో రూ 25 లక్షలు హెచ్చుతుంది ఇదివరకే ఈ ప్రాజెక్టుపై రూ 60 లక్షలు ఖర్చు చేయబడ్డవి

కుడికాలువ పొడవు 21 మైళ్లు ఎడమ కాలువ పొడవు 18 మైళ్ళు ఈ ప్రాజెక్టువల్ల సూర్యాపేట, నల్లగొండ తాలూకాలలోని క్షామపీడిత ప్రాంతాలకు, మిర్యాలగూడెం తాలూకాలోని కొద్దిప్రాంతానికీ మేలు కలుగుతుంది

## గ్రామాల ముంపు

ఈ ప్రాజెక్టు నిర్మాణంవల్ల నాలుగు గ్రామాలు నీట మునిగినవి ఆ గ్రామాల ప్రజలకు పరిహారం



*20-9-1957 తేదీన మూసీప్రాజెక్టు వద్ద జరిగిన రైతుల మహాసభలో రాష్ట్ర నీటిపారుదల శాఖామంత్రి ప్రసంగిస్తున్న దృశ్యం.*



పెద్దకాలువ దారిలో వాగులు అడ్డమొచ్చినప్పుడు అక్విడక్టులు నిర్మించి కాలువను పారిస్తారు అంతవరకూ తాత్కాలికంగా ఆర్ సి. సి. పైపులద్వారా నీరు పారించబడుతూవుంది

చెల్లించడానికై స్పెషల్ రెవిన్యూ ఆఫీసర్ తగు ఏర్పాట్లు చేస్తున్నారు ప్రాజెక్టు స్థలం వద్ద ఒక గ్రామం ఏర్పాటుకావచ్చు

వచ్చే సంవత్సరం రెండువైపులకూ నీరు వదల బడుతుంది వచ్చే సంవత్సరం జూన్ నెలవరకల్లా 10,000 ఎకరాలకు నీరు సప్లయికావలెనని మంత్రి గారు ఒకలక్ష్యం నిర్ణయించారు మొత్తం 38,000 ఎకరాల ఆయకట్టుఅభివృద్ధిపరచబడుతుంది. ఇందులో సగం ఒకవైపు, మిగతాసగం మరొకవైపు వుంటుంది. దీనిని 20 శతి హెచ్చించవచ్చునని ఆశింపబడు తున్నది. ప్రస్తుతం ఆబీ పంటకుమాత్రమే నీరుసప్లయి చేయబడుతున్నది

ఎలాగైనా ప్రాజెక్టు మొత్తం పని 1959 వర కల్లా పూర్తి అవుతుంది

గ్రామస్తుల సభలో సూపరింటెండింగ్ ఇంజనీరు ప్రసంగిస్తూ అనంతగిరి కొండలలో పుట్టి కృష్ణానదిలో కలుస్తున్న మూసీకి ఉస్మాన్‌సాగర్, హిమాయత్ సాగర్ అను రెండు రిజర్వాయర్లను నిర్మించి హైద్రాబాదు సికింద్రాబాదు నగరాలకు మంచీనీరు సరఫరా చేయబడుతున్నదనీ, ఆ నీరుపోగా ఇంకా మిగిలిపొయ్యే నీరు ఎంతో వుందనీ, దాన్ని ఇట్టి ప్రాజెక్టుల ద్వారా సేద్యానికి సరఫరా చేయడం జరుగుతున్నదనీ తెలియజేశారు

నల్లగొండ జిల్లా కలెక్టర్ ఆ సందర్భంలో ప్రసం గిస్తూ రైతు లెదుర్కొంటున్న ఇబ్బందులను విన రించారు పశువులు తగినన్ని లేవనీ, రైతుకు డబ్బు ఇబ్బందికూడావుందనీ అన్నారు ప్రాజెక్టుప్రాంతంలో భూమి మాగాణిగా అభివృద్ధి పరచబడుతూ వుండడంచూచి కొందరు ఎద్దుల ధరలను విపరీతంగా పెంచుతున్నారనీ, మెట్టభూమిని మాగాణి భూమిగా మార్చడానికి ఎన్నో పనులు మొదట జరగవలసి వుండడంచేత రైతుకు డబ్బు చాలా అవసరమనీ, అన్నారు అయితే ఈ ఇబ్బందులన్నిటినీ చూచి రైతులు బెదిరిపోవడం లేదనీ, వారు భవిష్యత్తుపై ఆశలు పెట్టుకొని ఉత్సాహంగానే వున్నారనీ, వారి ఆదాయం, జీవన ప్రమాణం ఈ ప్రాజెక్టు మూల

కంగా ఎప్పటికైనా పెరగగలదనే విశ్వాసం వారికి వుందనీ, అందుచేతనే తమ కర్తవ్యం నెరవేర్చడానికి వారు సంసిద్ధులై వున్నారనీ, అయితే ఏదో విధంగా అవసరమైన డబ్బు ఏదోవిధంగా లభింపజేస్తే మంచిదనీ అన్నారు.

రాష్ట్ర నీటి పారుదల శాఖామంత్రి ప్రసంగిస్తూ ఇంతవరకూ ప్రాజెక్టుపై జరిగిన పనిపట్ల సంతృప్తి వెలిబుచ్చి అందుకు కారకులైనవారి నందరినీ అభినందించారు. అయితే మూడేండ్ల లోపల మొత్తం లక్ష్యాన్ని పూర్తి చెయ్యాలనీ, వచ్చే సంవత్సరం జూన్ నెల వరకల్లా 10,000 ఎకరాలకు నీరు సరఫరా చేయబడవలెననీ అన్నారు. రైతులకు తగు సహాయం చేయబడుతుందని అన్నారు. మాగాణి సేద్యం మొదలు అయినతరువాత రైతులు నాలుగో సంవత్సరంనుంచి మాత్రమే ప్రభుత్వానికి పూర్తి శిస్తు చెల్లించవలసి వుంటుందన్న సంగతిని మంత్రి ప్రస్తావించి, ఇటువంటి అభివృద్ధి కార్యక్రమాన్ని విజయవంతం చేయడానికై రైతులు అధికార్ల సహకారం పొందవచ్చునని తెలియజేశారు.

కాలువక్రింద తమ భూములను అభివృద్ధి పరచడంలో ప్రముఖ పాత్ర వహించిన కొందరు రైతులకు ఈ సందర్భంలో బహుమతులు పంచిపెట్ట బడ్డవి.

రైతులను వ్యక్తిగతంగా కలుసుకొని వారు ఏమి ఆశిస్తున్నది, వారి భవిష్యత్పథకా లేమిటీ అని ప్రశ్నించగా ఎవరో కొందరు ఇతర ప్రాంతాలవారు వచ్చి భూముల ధరలను బాగా పెంచుతున్నారని అన్నారు. ఎకరం 80 రూ. లు ఖరీదుచేసే భూమి ఇప్పుడు వెయ్యి రూ. లకు మించి పోయిందని తెలిపారు. ముందు ముందు రూ. 2,000 ల వరకూ పోవచ్చని అన్నారు. అంటే భూ కామందుకు ఇంత మేలు జరిగిందన్నమాట. ఒకవేళ వారు భూమిని అమ్మక పోయినా, ఇకనుంచి దానిమీద వొచ్చే రాబడి ఐదు రెట్లు పెరుగుతుంది. ప్రాజెక్టు నిర్మాణమే దీనికి కారణం. అయితే కొంతకాలం గడవాలి. మొదట రైతులు డబ్బు భరాయించి తమ భూమిని మాగాణిగా అభివృద్ధి పరచుకోవాలిగదా. అది జరిగిందంటె ఇక వారికి అన్నీ మంచిరోజులే.

* * *

కొత్త పద్ధతులు :

# మెట్రిక్ పద్ధతి తూకములు కొలమానములు



భారతదేశంలో మెట్రిక్ పద్ధతి తూనికలను, కొలమానములను ప్రవేశపెట్టవలెననీ, ఆ ప్రవేశపెట్టడమనేది దానికి సంబంధించిన చట్టం గత సంవత్సరం ప్రవేశపెట్టబడినప్పటి లగాయతు పది సంవత్సరాలలోపల జరుగవలెననీ పార్లమెంటు తీర్మానించింది. తదనుగుణంగానే భారత ప్రభుత్వంచే నియమింపబడ్డ మెట్రిక్ పద్ధతి స్థాయీసంఘం ఈ పని 1958 ఏప్రిల్ 1 వ తేదీనుంచి మొదలుకావలెనని సిఫారసు చేసింది. అసలు ఈ మెట్రిక్ పద్ధతి అనేది తూకములు కొలమానముల విధానాన్ని సులభతరం చేయడానికీ. దేశమంతటా ఒకేరకం పద్ధతి అమలులోవుండునట్లు చేయడానికీ ఉద్దేశించబడింది. ఏమైనప్పటికీ ప్రజలకు మేలు చేసే సంస్కరణ ఇది. అయితే ప్రజలలో అన్నివర్గములవారూ ఈ పద్ధతి సంగతి సందర్భాలను మొదట బాగాతెలుసుకోవాలి. ప్రజల సహకారంవల్లనే పార్లమెంటు చేసిన పై నిర్ణయం విజయవంతంగా అమలు జరుగడానికి వీలేర్పడుతుంది.

మెట్రిక్ పద్ధతి భారతదేశానికి కొత్తకాదు. అసలు ఇది మొదట మనదేశంలోనే కనిపెట్టబడింది. ఆతరువాత ఇతర దేశాలవారు దీనిని విజయవంతంగా అవలంబించి అమలు జరుపుకుంటున్నారు. సంఖ్యలన్నిటినీ పదిగుర్తులలో వ్యక్తీకరణ చేసేపద్ధతిని రెండువేల ఏండ్ల క్రిందట ఒకానొక భారతీయ గణితశాస్త్రజ్ఞుడు కనిపెట్టాడు. క్రీ. శ. రెండవ శతాబ్దిలో భారతదేశ వర్తకులు ఈ పద్ధతిని రోజీప్టుకు గొనిపోయారట. అశోకచక్రవర్తి ఇంకా ఐదువందల ఏండ్లకు పూర్వమే తన బ్రాహ్మీ శాసనాలలో అంకెలను వ్రాయించినాడని ఒక చరిత్రకారుడు వ్రాశాడు. అయితే క్రీస్తు శకానికి ఒక శతాబ్ది పూర్వమే అజ్ఞాతుడైన భారతీయ గణితశాస్త్రజ్ఞుడొకడు గణితశాస్త్రానికి చాలా గొప్ప సేవ చేశాడు. ఆయన స్థానముల పద్ధతిని, సున్నాను కనిపెట్టాడు. ఈ పద్ధతినిబట్టే ఈపద్ధతి పథకంలో అంకెలకు వాటి



*ఈ పటములో నల్లరంగుతో చూపబడిన ప్రాంతాలు ప్రపంచంలో మెట్రిక్ పద్ధతిని అవలంబిస్తున్న దేశాలు.*

స్థానాన్నిబట్టి విలువ వస్తుంది ఉదాహరణకు 12 సంఖ్యలోనూ, 21 సంఖ్యలోనూ ఒకేరకపు అంకెలున్నాయి. అయితే ఆరెండు అంకెలలో ఒక్కొక్కటి ఏస్థానంలో వుంటుందో దానినిబట్టి సంఖ్యకు హెచ్చుతగ్గు విలువ వస్తుంది. ఈనాడు నాగరిక ప్రపంచమంతా తొమ్మిది అంకెలు, ఒకసున్నా తోటే సమస్త లెక్కలను గుణిస్తూ వ్యవహారాలను జరుపుకుంటూవుంది. కాని అసలు దీన్ని భారతదేశమే మొదట వ్యవహారంలోకి తెచ్చిందన్న సంగతిని అంతా విస్మరిస్తున్నారు. భారతదేశ పద్ధతితో పోల్చినట్లయితే ప్రాచీన గ్రీకుదేశపు అక్షరక్రమానుగతమైన గుర్తులు, రోమన్ సంకేతాలు మరీ అసౌకర్యంగా వుండేవి అని చెప్పాలి.

"భారతదేశపు ఈ కొత్తపద్ధతి ప్రస్తావన క్రీస్తు శకానికి కొంచెం పూర్వమూ, ఆతరువాత కాలంలోనూ వెలువడిన సంస్కృత సాహిత్యంలో వుంది. పదిహేనవ శతాబ్ది తరువాత భారతదేశ గణితశాస్త్రజ్ఞులంతా ఈ క్రొత్త పద్ధతినే అనుసరించ మొదలుపెట్టారు. ఏడవ శతాబ్దివరకల్లా ఈ పద్ధతి సుమిత్రా, కాంబోడియా, అన్నామ్ మొదలగు తూర్పు దేశాలకు వ్యాపించింది. ఈ విషయం శాసనాలలో భారతీయ శకపు తేదీలు వ్రాయబడిన వైనాన్నిబట్టి రుజువవుతున్నది.

ఒక శతాబ్ది తరువాత భారతదేశ గణితశాస్త్ర గ్రంథాలు వాగ్దాదులో అరబ్బీభాషలోనికి అనువదింప బడ్డవి. అంతకుపూర్వం అరబ్బీ వారికి సొంత అంకెలులేవు. గ్రీకు సంకేతాలను లేదా కాప్టిక్ సంకేతాలను వారు ఉపయోగించేవారు. తమ లెక్కలన్నిటినీ ఎబెకస్ అనే గణిత సాధనం ద్వారా తేల్చుకొనేవారు. కాని త్వరలోనే వారు భారతీయ పద్ధతియొక్క గొప్పదనాన్ని గమనించి దానిని ఎంతో మక్కువతో అవలంబించారు. తాము భారతదేశం నుంచే ఈపద్ధతిని స్వీకరించామన్న విషయాన్ని వారు పూర్తిగా అంగీకరించారు కూడా వారు ఆఫ్రికా ఖండంలోని కొన్ని ప్రాంతాలనూ, స్పెయిన్ దేశాన్నీ జయించినప్పుడు ఈ పద్ధతిని అక్కడకూడా ప్రవేశపెట్టారు. స్పెయిన్‌నుంచి ఇది యూరపు ఖండానికి ప్రాకింది. యూరపు ఖండవాసులు పది లేక పదకొండవ శతాబ్దిలో భారతీయ అంకెల పద్ధతినే అనుసరించ మొదలుపెట్టారు. అయితే 17 వ శతాబ్దిదాకా పాశ్చాత్య ప్రపంచంలో ఈపద్ధతి అంతగా వ్యాప్తిలోకి రాలేదు. ఆ తరువాతనే ఇది వ్యాప్తి చెందింది.

వివిధ గణితశాస్త్ర అంశాలను తేల్చుకోవడానికీ, వర్గమూలములను, ఘనమూలములను తెలుసుకోవడానికీ, ఘన సమీకరణములకూ ఆర్యభటుడనే గణితశాస్త్రజ్ఞుడు అనేక పద్ధతులను వివరించాడు. ఆయన లెక్కలన్నిటిలో దశాంశ పద్ధతినే అనుసరించేవాడు. ఈ విధంగా ఆయన ఇతర గణితశాస్త్రజ్ఞులకంటె ముందంజ వేశాడు."

భారతీయమైన ఈఅంకెలపద్ధతే మెట్రిక్ కొలత పద్ధతికి ప్రాతిపదికగా వుంది.

భారతదేశం మొత్తంలోనూ ఒకేరకమైన తూనికలు కొలతలపద్ధతిని ప్రవేశపెట్టాలన్న ప్రతిపాదనను మొదట కర్నల్ స్ట్రాచీ అనునాతడు 1867 లో చేశాడు. అతడు ఒక విజ్ఞాపనపత్రాన్ని సమర్పిస్తూ పాతపద్ధతికి బదులుగా ఫ్రెంచి మెట్రిక్ పద్ధతిని ప్రవేశపెట్టాలని సూచించాడు. తన విజ్ఞాపనపత్రంతోపాటు భారతదేశంలో తూనికలను కొలమానములను క్రమబద్ధం చేయడానికై ఒకబిల్లు ముసాయిదానుకూడా జతపరిచాడు. ఆ బిల్లు 1871 జనవరి 1 వ తేదీనుంచి శాసనంగా అమలులోకి రావలెనని అతడొక తేదీనికూడా నిర్ణయించాడు.

చట్టంప్రకారం దేశంలో మెట్రిక్ తూనికలు కొలమానముల పద్ధతిని ప్రవేశపెట్టవలెనని కర్నల్ స్ట్రాచీ బిల్లు సూచించింది. ఈ పద్ధతిని అమలు జరపడానికై అతడు అనేక చర్యలను. యంత్రాంగాన్ని కూడా సూచించాడు.

కర్నల్ స్ట్రాచీ విజ్ఞాపనపత్రం ప్రచురింపబడడంతోటే అది తీవ్ర విమర్శకు గురియైంది. 1870 లో ఈ బిల్లు శాసనం చేయబడింది. కాని కమిటీలోవున్న స్ట్రాచీ సహచరులలో అధికసంఖ్యాకులు, ఇంగ్లండు, భారతదేశాలలోని స్వార్థపరులు స్ట్రాచీ ప్రతిపాదనను వ్యతిరేకించి ఇంగ్లీషు ఫుట్ పౌండ్ పద్ధతిని సమర్థించడంచేత అదిఅమలు జరగలేదు. పర్యవసానమేమిటంటే కర్నల్‌స్ట్రాచీ ఆ కమిటీ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చాడు. ఈ విధంగా అత్యవసరమూ, ఉపయోగకరమూ అయిన ఈ సంస్కరణ విరమింప బడింది.

కాలం గడచినమీదట కర్నల్‌స్ట్రాచీ సూచనలలోని యాథార్థ్యం గమనించబడింది. ఒకదేశం తరువాత మరొక దేశం మెట్రిక్ పద్ధతిని అనుసరించడం మొదలుపెట్టాయి. ఈ పద్ధతి అంత సులభమైనది. అంత ఉపయోగకారికూడా. ఇలాంటి సంస్కరణ మనదేశంలోకూడా రావాలనే అభ్యుదయ వాదులు కోరుతూవచ్చారు. కాని భారతదేశంలో బ్రిటిషు పరిపాలన అంతమైన తరువాతనే ఈ పద్ధతిని



చిత్రంలో ముందరివైపు ఉన్నది ప్లాటినం కర్ర - దీనిపై మీటరునిడివి గుర్తుపెట్టబడివుంది

ప్రవేశపెట్టడానికి తగుచర్యలు గైకొనబడ్డవి. ప్లానింగు కమీషన్‌వారు ఈ సంస్కరణ ఆవశ్యకతను గమనించారు. స్టాప్రీ విజ్ఞాపనపత్రం సమర్పించబడ్డ 90 ఏండ్ల తరువాత స్వతంత్ర భారతపార్లమెంటు అతని ప్రతిపాదనలను ఆమోదించింది. మొదట మనదేశంలో దశాంశపద్ధతి నాణెములు ప్రవేశపెట్టబడ్డవి ఇక తూనికలు కొలమానములు ప్రవేశ పెట్టబడాలి.

## మీటరు

మెట్రిక్ పద్ధతిలో మీటరు ప్రాథమిక మూల పరిమాణం ఇది అంతర్జాతీయ ఒడంబడికద్వారా ప్రమాణ బద్ధం చేయబడింది. ఒకేవిధంగా వుండే అంతర్జాతీయ మీటర్ రూపొందించబడింది అది సెవ్రెస్ (ఫ్రాన్సు) లోని అంతర్జాతీయ తూనికలు కొలమానముల సంస్థలో వుంది. ఇది ప్లాటినం, లేక ఇరిడియం మిశ్రమలోహంతో ఒక పుల్లమాదిరిగా వుంటుంది. దానిపై 'మీటర్' కొలత గుర్తుపెట్టబడివుంది ఇది సార్వజనీనమైన ప్రమాణం గల మీటర్. ప్లాటినం - ఇరిడియం మిశ్రమలోహంతో తయారు చేయబడడంవల్ల శీతోష్ణస్థితి మార్పుల మూలకంగా దీనిలో ఎట్టి పరిణామమూ సంభవించదు

ఇక మెట్రిక్ పద్ధతిలో పూర్తి కొలత ఎలా వస్తుందీ అన్న ప్రశ్న కలుగుతుంది. మీటర్‌ను పదితో గుణించితే ఆ కొలతవస్తుంది. మీటర్‌ను వివిధంగా గుణించడానికై గ్రీకు ఉపసర్గలను అంటే పదిరెట్లకైతే డెకా, నూరురెట్లకైతే హెక్టో, వెయ్యిరెట్లకైతే కిలో అను మాటలను మీటర్ అనే పదానికి ముందుంచుతారు. ఉపగుణిజాలకు లాటిన్ ఉపసర్గలను ఉపయోగిస్తారు. అంటే 1/10 వంతుకు డెసీ అనీ, 1/100 వంతుకు సెంటి అనీ, 1/1000 వంతుకు మిల్లీ అని తగిలిస్తారు. ఈవిధంగా ఈ ఆరు ఉపసర్గలూ, ఇవిగాక ప్రధానమూలాల నిడివికైతే మీటర్, పరిమాణానికైతే లీటర్ లేక క్యూబిక్ డెసీ మీటర్, ఘనపరిమాణానికయితే క్యూబిక్ మీటర్, రాశికి గ్రామ్, విస్తీర్ణానికి స్క్వేర్ మీటర్, భూమికొలతలకు హెక్టేర్ లేక స్క్వేర్ హెక్టామీటర్ మొదలగు పారిభాషిక ప్రయోగాలు అమలులో కొచ్చాయి.

ఈ విధానంలో మరో ముఖ్యవిశేషం నిడివి, పరిమాణం, రాశి మొదలగు ప్రాథమిక మూలాల మధ్యగల సంబంధం. మీటర్‌లో నూరోవంతుయొక్క ఘనముతో సమానమగు స్వచ్ఛమైన నీటిరాశి ఒక గ్రాము అవుతుంది. అయితే లావాదేవీలకు గ్రాము చాలా చిన్నరూకం అవుతుంది. కాబట్టి ఆచరణలో కిలోగ్రాము బాగా ఉపయోగ పడుతుంది లీటర్ అంటే ఒక కిలోగ్రాము స్వచ్ఛమైన నీరు ఆక్రమించే ఘనపరిమాణం అన్నమాట

మీటర్ అనేమాట గ్రీకుపదమగు "మెట్రాన్" నుండి. లాటిన్ క్రియ 'మె' (కొలుచుట) నుండి వచ్చినది. ఫ్రెంచి విప్లవం తరువాత నిరంకుశ జమీందారీ విధానప్పయానిట్లకు బదులుగా తూనికలకు కొలతలకు కొత్తపద్ధతిని అన్వేషించవలసిందని టాలీరాంప్ ఉత్తర్వు చేశాడు. అనేకమంది ఇంజనీర్లు, శాస్త్రజ్ఞులు చేసిన పరిశోధనల ఫలితంగా 'మీటర్' అనే ప్రమాణబద్ధమైన నిడివి మూలం కనుగొనబడింది ఆ తరువాత ఒక్కొక్క పార్శ్వం మీటర్‌లో పదోవంతు కొలతకు సమానమైన ఘనపరిమాణాన్ని 'లీటర్' అన్నారు ఇది పరిమాణం విషయంలో ప్రమాణబద్ధమైన యూనిట్ అయింది ఒక ఘనపరిమాణంలో వుండే నీటియొక్క కచ్చితమైన బరువును 'కిలోగ్రాం' అన్నారు. ఇది రాశి విషయంలో ప్రమాణబద్ధమైన

యూనిట్ నడిమి కొలత ఎత్తు ఒకే విధంగా వుండే (అంటే 39 యం యం) ప్లాటినం గొట్టం నమూనా కిలోగ్రాంగా అంగీకరించబడింది

మెట్రిక్ పద్ధతి విధానం 1799 లో ప్రవేశపెట్ట బడింది కాని ఇది 1840 లో మాత్రమే ఏకైక చట్టబద్ధమైన విధాన మైంది ఈ కాలంలో అనేక ప్రభుత్వాలు ఈ పద్ధతి విధానాన్ని పరిగణించడమో అనుసరించడమో జరిగింది అప్పుడు అంతర్జాతీయ సమన్వయం ఆవశ్యకమైంది 1870 లో ఫ్రెంచి ప్రభుత్వం ఒక అంతర్జాతీయ సమావేశాన్ని జరిపింది అందులో 30 దేశాల ప్రతినిధులు పాల్గొన్నారు అయితే ఇంతలో ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధం సంభవించడంవల్ల ఈ సమావేశానికి అంతరాయం కల్గింది అయినా మళ్ళీ 1872 లోనూ, 1875 లోనూ ఈ సమావేశం జరిగింది చర్చలు ముగిసిన తరువాత ప్రతినిధులు "మీటర్ ఒడంబడిక" అను పత్రంపై సంతకాలు చేశారు మీటర్‌కూ కిలోగ్రాముకూ అంతర్జాతీయ నమూనాలను తయారుచేయడానికై అంతర్జాతీయ సంస్థ నెలకొల్పబడింది

## ఇక చిక్కులుండవు

మన దేశంలో తూనికలు, కొలతల విధానాన్ని ప్రమాణబద్ధం చేయవలసిన ఆవశ్యకతను అంతా గుర్తించారు తూనికలకు కొలతలకు మన దేశంలో ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క విధానం అమలులోవుంది. ఇన్ని విధానాలుండడంవల్ల పెద్ద చిక్కుగావుంది. ఒకే పేరుగల యూనిట్లకు విలువలు వేరు వేరుగా వున్నాయి ఇదికూడా పెద్ద చిక్కుగా వున్నది నేషనల్ శాంపిల్ సర్వేవారు పరిశోధన జరుపగా భారతదేశంలోని 1100 గ్రామాలలో 143 రకాల తూకములు వాడుకలో వున్నట్లు తెలియవచ్చింది ఇక ఘనపరిమాణం, విస్తీర్ణముల కొలతల విషయంలో పరిస్థితి మరీ చిక్కుగావుంది కొన్ని ప్రాంతాలలో తూకముల పేర్లు ఒకటే అయినప్పటికి బరువులు మాత్రం వేర్వేరుగా వున్నవి ఉదాహరణకు 100 రకాల మణుగులు వాడకంలో వున్నవి వాటి బరువులు 280 స్టాండర్డు తులాలు మొదలు 8300 తులాల వరకు వున్నవి అలాగే ప్రతిచోట శేరు అనేమాటే వ్యవహారంలోవుంది కాని దాని బరువుమాత్రం 8 తులాలు మొదలు 160 తులాల వరకూవుంది ప్రమాణబద్ధమైన శేరుబరువు 80 తులాలు ఒక యూనిటును ఒక ప్రాంతంలో ఒక పేరుతో వ్యవహరిస్తే మరో ప్రాంతంలో దాన్ని మరో పేరుతో వ్యవహరిస్తున్నారు దీనివల్ల సామాన్య మానవుడు అయోమయ స్థితిలోపడి ఎందుకొచ్చిందిరా ఈ బెరమని నిస్పృహ జెందుతున్నాడు



అంతర్జాతీయ నమూనా మీటర్

ఈవిధమైన చిక్కు పరిస్థితివల్ల ప్రజలలో అన్ని వర్గములవారు ఇబ్బంది పడుతున్నారు అయితే రైతుపడె ఇబ్బంది పెద్దది ప్రమాణబద్ధమైన తూకం లేకపోవడం చేత రైతు తాను పండించిన సరుకుకు సరియైన మూల్యం పొందలేకపోతున్నాడు మార్కెట్ కొటేషన్లు రైతుకు అర్ధంకావు అందుచేత అతడు దళారీలవల్ల వర్తకులవల్ల మోసగింపబడుతున్నాడు

మెట్రిక్ పద్ధతిని ప్రవేశపెట్టడంవల్ల ఈ చిక్కులన్నీ తొలగిపోతాయి రష్యా విద్వాంసుడొకడు ఈ పద్ధతిని గూర్చి అభిప్రాయమిస్తూ "ఇది ప్రాథమికమైన శక్తి

మోసంచేసి లోబరచుకోవడానికి అసాధ్యమైనది" అన్నాడు. చిక్కులన్నీ తొలగినప్పుడు వర్తక వాణిజ్యాలు సాఫీగా సాగుతాయి. మనదేశ పారిశ్రామిక వ్యవస్థకూడా బల పడుతుంది.

ఈ కొత్తపద్ధతిని అవలంబించడంవల్ల మనం విదేశాలతో చేసే వ్యాపారానికి కూడా వెసులుబాటు కలుగుతుంది. ప్రపంచమంతటా మెట్రిక్ పద్ధతే అమలులో వున్నది. కనుక విదేశ వాణిజ్యాన్ని ఈపద్ధతి సులభతరం చేస్తుంది. అంతర్జాతీయ సహకారం విషయంలో, మెట్రిక్ పద్ధతి అవలంబన అన్నిటికంటె కొట్టవచ్చినట్టు కన్పిస్తుంది. అమెరికా సంయుక్త రాష్ట్రాలు, బ్రిటను, ఇతర కామన్వెల్తు దేశాలు తప్ప మిగతా అన్ని దేశాలలో ఈ విధానమే చట్టబద్ధమైనది అమెరికా, బ్రిటను, ఇతర కామన్వెల్తు దేశాలలో ఇంగ్లీషు ఫుట్‌పౌండ్ పద్ధతి అమలులో వున్నది ఈ దేశాలలో కూడా మెట్రిక్ పద్ధతి చట్టబద్ధమైనదే వాగా వాడకంలో వున్నదే

మెట్రిక్ పద్ధతి అమలులోకి రావడంతో అనేక రంగాలలో లెక్కలు కష్టేపని సులభతరమై పోతుంది ఇంగ్లీషు పద్ధతి, మన మణుగులూ సేర్లపద్ధతి ఒక క్రమంలేకుండా వ్యాప్తిలోకి వచ్చాయి కాని మెట్రిక్‌పద్ధతి అలా కాదు ఇది శాస్త్రీయమైనది బహుసామాన్యమైనది సార్వజనీనమైనది అంతటా ఒకే విధమైన వాడకానికి దోహదమిచ్చునది దీని నిర్మాణం సమమితి గలది కాబట్టి ఇతర విధానములన్నిటి కంటె ఇది శ్రేష్ఠమయినది

## మెట్రిక్ పద్ధతి మూలములు (యూనిట్లు)

మెట్రిక్ పద్ధతిలోగల ఐదు ప్రధాన మూలముల అంతర్జాతీయ నామములు ఇవి

| | |
|---|---|
| నిడివికి | మీటర్ |
| విస్తీర్ణానికి | స్క్వేర్ మీటర్ |
| ఘనపరిమాణానికి | క్యూబిక్ మీటర్ |
| రాశికి | కిలోగ్రామ్ |
| పరిమాణానికి | లీటర్ |

1956 సంవత్సరపు తూకములు కొలతల ప్రమాణముల చట్టం (1956 లో 89 వది) భారతదేశంలో మెట్రిక్ పద్ధతి తూకములను కొలమానములను ప్రవేశపెట్టవలెనని నిర్దేశిస్తున్నది ఆ చట్టంలో ప్రధానమూలములు ఈ విధంగా నిర్వచింపబడ్డవి ఆ మూలముల గుణిజములకు సబ్ యూనిట్లకు గల అంతర్జాతీయ నామములు ఇవి



పొం ఇనుము ఇత్తడిలో పోయబడిన తూకములు - ఇది వ్యాపారస్తుల సెట్టు

నిడివి మైక్రాన్ మిల్లీమీటర్ సెంటిమీటర్, డెసీమీటర్ డెకామీటర్ హెక్టామిటర్, కిలోమీటర్, మెరియామీటర్

విస్తీర్ణం స్క్వేర్ మిల్లీమీటర్, స్క్వేర్ సెంటిమీటర్, వగైరా

ఘనపరిమాణం క్యూబిక్ మిల్లీమీటర్, క్యూబిక్ సెంటిమీటర్ వగైరా

రాశి మైక్రోగ్రాం, మిల్లీగ్రాం సెంటిగ్రాం, డెసీగ్రాం, డెకాగ్రాం హెక్టాగ్రాం, కిలోగ్రాం క్వింటాల్, మెట్రిక్‌టన్ను

పరిమాణం మైక్రోలీటర్, మిల్లీలీటర్, సెంటిలిటర్, డెసిలీటర్ డెకాలీటర్, హెక్టాలీటర్ కిలోలీటర్

పై పేర్లను చూచినట్లయితే ఒక ఉపసర్గను అంటే మిల్లీ, సెంటి డెసి మొదలగు వాటిని ప్రధానమూలమునకు ముందుంచి గుణిజములు లేక ఉపగుణిజముల పేర్లుగా వ్యవహరింపబడుతున్నవని ఆ ఉపసర్గయె ప్రధానమూలము ఉపమూలముయొక్క సంబంధమును తెలుపుతున్నదని విదితం కాగలదు

మెట్రిక్ యూనిట్లకు హిందీపేర్లు వుండాలని ఒక ప్రతిపాదన చెయ్యబడింది కాని పార్లమెంటు జాయింట్ సెలక్టుకమిటీవారు ఆ ప్రతిపాదనను క్షుణ్ణంగా పరిశీలించిన మీదట భారతదేశంలో అంతర్జాతీయ నామములనే వాడవలెనని సిఫార్సు చేశారు పార్లమెంటు ఈ సిఫారసును ఆమోదించింది కనుక చట్టంలో అంతర్జాతీయనామములే ఉదాహరింపబడ్డవి

తూనికలు కొలమానముల కొత్తపద్ధతిలో అనేకరకాల తూకములు కొలమానాలు వుంటాయి కనుక చిక్కు లేకుండా వుండాలంటే వాటిని అందరూ బాగా అర్థంచేసుకొని ఆ పేర్లను గుర్తుంచుకోవాలి నిత్యం వాడకంలో వుండే తూకములు పరిమాణములు ఇవి

### (అ) లోహపు తూకములు

#### కిలోగ్రాం (కె జి) సీరీస్

| పోత ఇనుము సాగకొట్టిన ఉక్కు తూకములు | ఇత్తడి, కంచు తూకములు |
|---|---|
| 50 | 20 |
| 20 | 10 |
| 10 | 5 |
| 5 | 2 |
| 2 | 1 |
| 1 | |

#### గ్రాం (జి) సీరీస్

| | |
|---|---|
| 500 | 500 |
| 200 | 200 |
| 100 | 100 |
| | 50 |
| | 20 |
| | 10 |
| | 5 |
| | 2 |
| | 1 |

### (ఆ) రేకు లోహపు తూకములు

#### మిల్లిగ్రాం (యం జి) సీరీస్

| | | |
|---|---|---|
| 500 | 50 | 5 |
| 200 | 20 | 2 |
| 100 | 10 | 1 |



అన్నిటికంటె లోపలిఫ్లాస్కులో అంతర్జాతీయ నమూనా కిలోగ్రాం చూపబడింది.



వెండి బంగారాలను తూయడానికి ఉపయోగించే కిలోగ్రాం.
ఇవి ఇత్తడితోనూ, పోత ఇనుముతోనూ చేయబడినవి.



బజారు తూకములసెట్టు - ఇవి ఇత్తడితో చేయబడినవి.





వెండి, బంగారాలను తూచే క్రొత్తసెట్టు.
ఇవి ఇత్తడితో చేయబడినవి.





పోత ఇనుముతో తయారుచేయబడిన తూకములపూర్తిసెట్టు.

*పరిమాణం*

| గొట్టపు కొలతలు | | శంఖీయ కొలతలు |
|---|---|---|
| ముంచేరకాలు | పోసేరకాలు | |
| 1 లీటర్ | 2 లీటర్లు | 20 లీటర్లు |
| 500 మిల్లీ లీటర్లు | 1 లీటర్ | 10 లీటర్లు |
| 200 యం. యల్. | 500 మిల్లీ లీటర్లు | 5 లీటర్లు |
| 100 యం. యల్. | 200 యం. యల్. | 2 లీటర్లు |
| 50 యం. యల్. | 100 యం. యల్ | 1 లీటర్ |
| 20 యం. యల్. | 50 యం. యల్. | 500 మి. లీ |
| | | 200 యం. యల్ |
| | 20 యం. యల్. | 100 యం. యల్ |

*మారకపు వ్యవహారం.*

ఇంతవరకూ వాడుకలో వున్న పాత యూనిట్లను కొత్త మెట్రిక్ యూనిట్లలోనికి మార్చుకోవడానికి ఈ క్రింది విధంగా విలువలు నిర్ణయించనైనది. దీనితో కొత్త తూనికలు కొలమానములను చక్కగా అర్థం చేసుకోవచ్చు

*నిడివి -*

కిలో మీటర్ - 0.62 మైలు, మైలు - 1.61 కిలోమీటర్లు.

మీటర్ - 1.09 గజములు, గజము - 0 91 మీటర్.

సెంటీ మీటర్ - 0.39 అంగుళం.

మిల్లీమీటర్ - 0.04 అంగుళం, అంగుళం - 25.4 మిల్లీ మీటర్స్ (కచ్చితంగా)

*విస్తీర్ణం ..*

స్క్వేర్ కిలోమీటర్ - 0.39 చదరపు మైలు. చదరపు మైలు - 2.59 స్క్వేర్ కిలోమీటర్లు.

హెక్టార్ (10,000 చదరపు మీటర్లు) - 2.47 ఎకరాలు ఎకరం - 0 40 హెక్టార్.

స్క్వేర్ మీటర్ - 1.20 చదరపు గజములు. చదరపు గజం - 0.84 స్క్వేర్ మీటర్.

*ఘనపరిమాణం :*

క్యూబిక్ మీటర్ - 1.31 క్యూబిక్ గజము. క్యూబిక్ గజము - 0 76 క్యూబిక్ మీటర్.

*పరిమాణం.*

లీటర్ - 0 22 ఇంపీరియల్ గ్యాలన్. ఇంపీరియల్ గ్యాలన్ - 4.55 లీటర్లు.

*తూకములు :*

మెట్రిక్ టన్ను - 0.98 టన్ను. టన్ను - 1.02 మెట్రిక్ టన్నులు.

క్వింటాల్ - 1.97 హండ్రెడ్ వెయిట్లు. హండ్రెడ్ వెయిట్ - 0.51 క్వింటాల్.

క్వింటాల్ - 2.68 మణుగులు. మణుగు - 0.37 క్వింటాల్.

కిలోగ్రాం - 1.07 శేర్లు శేరు - 0.93 కిలోగ్రాం.

కిలోగ్రాం - 2.20 పౌండ్లు. పౌండు - 0.45 కిలోగ్రాం.

గ్రాం - 0.09 తులం తులం - 11.66 గ్రాములు.

# సామాన్య మారకపు పట్టికలు

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| **1. నిడివి :** | | | | | | | | | | | | |
| మైళ్ళనుంచి కిలోమీటర్లకు | | | | | | | | | | | | |
| మైళ్ళు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | | |
| కిలోమీటర్లు | 1.61 | 3.22 | 4.83 | 6.44 | 8.05 | 9.66 | 11.27 | 12.88 | 14.48 | 16.09 | | |
| గజములనుంచి మీటర్లకు | | | | | | | | | | | | |
| గజములు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | | |
| మీటర్లు | 0.91 | 1.83 | 2.74 | 3.66 | 4.57 | 5.49 | 6.40 | 7.32 | 8 23 | 9.14 | | |
| అంగుళములనుంచి మీటర్లకు | | | | | | | | | | | | |
| అంగుళములు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| మిల్లీమీటర్లు | 25.40 | 50.80 | 76.20 | 101.60 | 127.00 | 152.40 | 177.80 | 203.20 | 228.60 | 254.00 | 279.40 | 304.80 |
| **2. విస్తీర్ణం :** | | | | | | | | | | | | |
| ఎకరములనుంచి హెక్టార్లకు | | | | | | | | | | | | |
| ఎకరములు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | | |
| హెక్టార్లు | 0.40 | 0.81 | 1.21 | 1.62 | 2.02 | 2.43 | 2.83 | 3.24 | 3.64 | 4.05 | | |
| చదరపుగజములనుంచి చదరపుమీటర్లకు | | | | | | | | | | | | |
| చదరపుగజములు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | | |
| చదరపుమీటర్లు | 0.84 | 1.67 | 2.51 | 3.34 | 4.18 | 5.02 | 5.85 | 6.69 | 7.53 | 8.36 | | |
| **3. పరిమాణం :** | | | | | | | | | | | | |
| గ్యాలనుల (ఇంపీరియల్) నుంచి లీటర్లకు | | | | | | | | | | | | |
| గ్యాలనులు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | | |
| లీటర్లు | 4.55 | 9.10 | 13.64 | 18.18 | 22.73 | 27.28 | 31.82 | 36.37 | 40.91 | 45.46 | | |
| **4. తూకములు :** | | | | | | | | | | | | |
| టన్నులనుంచి మెట్రిక్ టన్నులకు | | | | | | | | | | | | |
| టన్నులు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | | |
| మెట్రిక్ టన్నులు | 1.02 | 2.03 | 3.05 | 4.06 | 5.08 | 6.10 | 7.11 | 8.13 | 9.14 | 10.16 | | |
| పౌండ్లనుంచి కిలోగ్రాములకు | | | | | | | | | | | | |
| పౌండ్లు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | | |
| కిలోగ్రాములు | 0.45 | 0.91 | 1.36 | 1.81 | 2.27 | 2.72 | 3.18 | 3.63 | 4.08 | 4.54 | | |
| తులాలనుంచి గ్రాములకు | | | | | | | | | | | | |
| తులం | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | | |
| గ్రాము | 11.66 | 23.33 | 34.99 | 46.66 | 58.32 | 69.98 | 81.65 | 93.31 | 104.97 | 116.64 | | |
| శేర్లనుంచి కిలోగ్రాములకు | | | | | | | | | | | | |
| శేర్లు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | | |
| కిలోగ్రాములు | 0.93 | 1.87 | 2.80 | 3.73 | 4.67 | 5.60 | 6.53 | 7.46 | 8.40 | 9.33 | | |
| మణుగులనుంచి క్వింటాల్సుకు | | | | | | | | | | | | |
| మణుగులు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | | |
| క్వింటాల్సు | 0.37 | 0.75 | 1.12 | 1.87 | 2.24 | 2.61 | 2.99 | 3.36 | 3.73 | | | |



తుంగభద్ర ప్రాజెక్టు

# దర్శనీయమైన సుందరప్రదేశాలుగా రూపొందిన నదీలోయ ప్రాజెక్టులు

ఆంధ్రుల చరిత్రలో తుంగభద్రానదికి గల స్థానము సువిదితము. తుంగ, భద్ర అను రెండు చిన్న నదుల కలయికవల్ల ఈ నది ఏర్పడినది. ఆ రెండునదులూ మైసూరు రాష్ట్రంలోని పశ్చిమకనుమలకు సంబంధించిన వరాహపర్వతం నుంచి పుట్టినవి

హోస్పేటకు పడమట మూడుమైళ్ళ దూరంలో తుంగభద్రకు రిజర్వాయరు నిర్మింపబడింది. దక్షిణ రైల్వేలో విజయవాడ - హుబ్లీ మీటర్‌గేజి రైలుమార్గంపై హోస్పేట వున్నది. ఇరువైపులా తరుచు కరువుకాటకాలకు గురి అవుతున్న సువిశాలమైన భూభాగానికి సాగునీటివసరు కల్పించి ఆ ప్రాంతాన్ని సస్యశ్యామలం చేయాలన్న సంకల్పంతో పూర్వపు హైద్రాబాదు, మద్రాసు రాష్ట్రప్రభుత్వాలు (ఇప్పుడు ఆంధ్రప్రదేశ్, మైసూరు రాష్ట్రాలు) ఈ రిజర్వాయరు నిర్మాణాన్ని ఉమ్మడిగా ప్రారంభించాయి. కుడివైపున రిజర్వాయరునుండి తీయబడ్డ కాలువవల్ల మైసూరురాష్ట్రంలో బళ్ళారి జిల్లాకు చెందిన హోస్పేట, బళ్లారి, సిరిగుప్ప తాలూకాలకు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో కర్నూలు జిల్లాకు చెందిన ఆలూరు, ఆదోని, పత్తికొండ తాలూకాలకు సాగునీరు సరఫరా అవుతుంది పోతే పూర్వపు హైద్రాబాదు రాష్ట్రంవైపున రాయచూరు జిల్లాకు, (ఇప్పుడిది మైసూరు రాష్ట్రంలో చేరింది.) మహబూబ్‌నగర్ జిల్లాలోని (ఇది

ఆంధ్రప్రదేశ్‌లో వుంది.) గద్వాల, అలంపురం తాలూకాకాలకు ఈ ప్రాజెక్టువల్ల మేలు కలుగుతుంది.

ఈ ప్రాజెక్టు ప్రారంభోత్సవం 1945 లో అప్పుడు మద్రాసు గవర్నరుగా వున్న సర్ ఆర్థర్ హోప్ చే జరుపబడింది. పూర్వపు హైద్రాబాదురాష్ట్రింపైపు ప్రాజెక్టువనికి బెరారు యువరాజు (ప్రిన్స్ ఆఫ్ బెరారు) ప్రారంభోత్సవం చేశారు.

## డాము విశేషాలు

భారతదేశంలోని భారీ సీటిపనరు పథకాలలో తుంగభద్ర రిజర్వాయరు ఒకటి. తుంగభద్ర ఆనకట్టవల్ల ఏర్పడిన రిజర్వాయర్ పరిమాణం కావేరినదిపై నిర్మింపబడ్డ మెట్టూరు రిజర్వాయరుకు $11\frac{1}{4}$ రెట్లు వుంటుంది డాము మూడు భాగాలుగావుంది. (1) దాదాపు 5942 అడుగుల రాతికట్ట, వరదనీరును డాముమీదుగా పోనివ్వడానికై మధ్యలో దాదాపు 2300 అడుగుల స్పిల్వే విభాగం. (2) మట్టికట్ట (3) ఎడమ చివర మిశ్రమ ఆనకట్ట. అంటే కొంత రాతి కట్ట, కొంత మట్టికట్ట అన్నమాట.

తుంగభద్ర డాము మధ్యరకపు స్ట్రెయిట్ గ్రేవిటీడాము. ఇది పెద్దపెద్ద రాళ్ళతో గరిష్ఠం 160 అడుగుల ఎత్తున నిర్మింపబడింది. పునాదులు కూడా చాలా లోతైనవి. సగటు నదీగర్భం మట్టానికి 110 అడుగుల ఎత్తున డాము నిర్మింపబడింది. అడుగున డాము గరిష్ఠ వెడల్పు 100 అడుగులు. డాము పైభాగాన 22 అడుగుల వెడల్పు రోడ్డుమార్గంవుంది. స్పిల్వే క్రెస్టు గేట్లు (పైతలుపులు) 33 వున్నవి. ఒక్కొక్క తలుపు వెడల్పు 60 అడుగులు, ఎత్తు 15 అడుగులు, ముందుముందు పూర్తి రిజర్వాయరు మట్టం గనుక పెరిగేటట్లయితే ఈ తలుపు ఎత్తును కూడా హెచ్చించడానికి అవకాశ ముంచబడింది. 20 అడుగుల లోతున పైగుండా నీరు వెళ్ళిపొయ్యేటట్లుగా, గరిష్ఠం 6,50,1000 క్యూజెక్కుల వరద వెళ్ళిపొయ్యేటట్లుగా స్పిల్వే రూపొందిచబడింది. ఈ రిజర్వాయరు ఆరగాణి విస్తీర్ణం 10,880 చదరపుమైళ్ళు. రిజర్వాయరు నీటిపరిమాణం 1,13,000 యం. సి. అడుగులు. దీనిక్రింద మొత్తం 65 గ్రామాలు మునిగిపోయినవి. ఆప్రాంతం చరిత్ర, సంప్రదాయాలనుబట్టి ఈ రిజర్వాయరును "పంపాసాగర్" అని అనడం ఎంతైనా సమంజసంగా వుంటుంది.

ఇది సాగునీటికీ, విద్యుచ్ఛక్తి ఉత్పత్తికీ ఉపయోగపడే ప్రాజెక్టు కుడివైపున 2,48,502 ఎకరాలకు సాగునీరు లభిస్తుంది. అందులో 1,56,913 ఎకరాలభూమి ఆంధ్ర



*నిజాంసాగర్ డాము*



కోయిలసాగర్ ప్రాజెక్టు

ప్రదేశ్ రాష్ట్రానిది. 91,589 ఎకరాలభూమి మైసూరు రాష్ట్రానిది. ఎడమవైపున 5,80,000 ఎకరాల భూమివుంది. ఈ ప్రాజెక్టువల్ల సాగునీరేగాక జలవిద్యుచ్ఛక్తి కూడా ఉత్పత్తి అవుతున్నది. ఈ ఉత్పత్తి రెండు దశలుగా జరుగుతుంది. మొదటిదశ డాము వెనుకభాగాన. రెండవ దశ కుడికాలువకు దిగువన 14 మైళ్ళ దూరంలో ఒకచోట, ఎడమ కాలువపై అనేకచోట్ల జరుగుతుంది. ఈప్రాజెక్టు కుడివైపున 30,000 కిలోవాట్ల ఫర్మ్‌పవర్, ఎడమవైపున 1,10,000 కిలోవాట్లు సరఫరా చేయగలుగుతుంది.

ప్రాజెక్టు నిర్మాణం పూర్తి అయింది. గడచిన ఏడాదిన్నరనుంచి భూములకు నీరు వదలబడుతున్నది, ఇంతవరకు 73,650 ఎకరాలభూమి సాగుకు లాయకుగా అభివృద్ధి పరచబడింది. జలవిద్యుచ్ఛక్తి పథకం పని ఇంకా జరుగుతున్నది.

ఈ ప్రాజెక్టు ఆ ప్రాంతంలో ఆహార కొరతను తీర్చి, వ్యవసాయాభివృద్ధి కొరకే ముఖ్యంగా ఉద్దేశింపబడి నప్పటికీ, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కావడంతో గ్రామాలకు విద్యుద్దీపాలు కూడా ఏర్పాటవుతాయి. లభ్యమయ్యే విద్యుచ్ఛక్తిని బట్టి ఈ ప్రాంతంలో చక్కెర, వస్త్రం, సిమెంటు, ఇనుము కాగితపు మిల్లులను కూడా నెలకొల్పవచ్చు. రిజర్వాయరు వల్ల మత్స్యసంపద కూడా లభించగలదు.

తుంగభద్రానదికి రెండువైపులా కొండశిఖరాలపై యాత్రికులకొరకు రెండు విశ్రాంతి గృహాలున్నవి. ఇదొక విశేషమే అని చెప్పాలి. కుడివైపున ఉన్న విశ్రాంతి గృహాన్ని "వైకుంఠం" అంటారు. ఎడమవైపు వున్నదాన్ని "కైలాసం" అంటారు. ఈ విశ్రాంతి గృహాలనుంచిచూస్తే విశాలమైన ప్రాజెక్టుప్రాంతం దృశ్యం ఎంతో నేత్రపర్వంగా వుంటుంది. చీకటి పడగానే ఈ ప్రాంతమంతా విద్యుద్దీపాలు వెలిగి శోభాయమానంగా వుంటుంది. ఒకప్పుడు విజయనగరం అని పేర్వడిన ఈ ప్రాంతం ఇప్పుడు రాత్రి వేళ చూస్తే "దీపనగరం" అనిపిస్తుంది.

ఈ ప్రాజెక్టువల్ల ఈ ప్రాంతపు ఆర్థిక జీవితం రూపురేఖలు మారడం తథ్యం. ఇటీవలివరకూ ఎడారిగా పడివుండి క్షామపీడితమైనఈ ప్రాంతానికి దీనితో సిరిసంపదలు కలిగి మళ్ళీ విజయనగర సామ్రాజ్యపు విస్మృత సౌభాగ్యాన్ని జ్ఞప్తికి తేగలదు.

## తెలంగాణాలో నదీ లోయ ప్రాజెక్టులు

తెలంగాణాప్రాంతంలో అనేక నదీ లోయ ప్రాజెక్టులు నిర్మింపబడ్డవి. ఇవి భూములకు నీటి సరఫరాకేగాక, విద్యుచ్ఛక్తి ఉత్పత్తికీ, త్రాగునీటి సరఫరాకూ వరదల నిరోధానికీకూడా ఉపయోగపడుతున్నవి. పైగా దర్శనీయ మైన రమణీయకేంద్రాలుగాకూడా మారినవి. దేశాటనం చేయువారు చూడదగిన వీకేంద్రాలు. వీటిలో ఆధునిక సౌక ర్యాలన్నీ ఏర్పాటుచేయబడ్డవి. ఎట్టి కష్టం లేకుండా సుల భంగా ఈ కేంద్రాలకు వెళ్ళవచ్చు. అక్కడ వుండడానికి కూడా ఎంతో సుఖంగా వుంటుంది. ముఖ్యమైన ప్రాజెక్టుల వివరాలు ఈదిగువ ఉదహరింప బడుతున్నవి.

### హుసేన్ సాగర్

ఈ రిజర్వాయర్ ఆంధ్రప్రదేశ్ రాజధానియైన హైద్రా బాదు నగరం మధ్యన వున్నది దీని కట్టమీదినుంచిపొయ్యే రోడ్డు హైద్రాబాదు సికింద్రాబాదు నగరాలకు మధ్యదారిగా ఉపయోగింపబడు తున్నది.

వరంగల్లు జిల్లాలో ప్రాచీన తటాకములను మినహా యిస్తే ఈ ప్రాంతంలో హుసేన్‌సాగరే చాలా పాత రిజ ర్వాయరు. ఇది గోల్కొండను పాలించిన ఖుతుబ్‌షాహీ వంశస్థాపకుడైన సుల్తాన్ ఖులీ ఖుతుబ్‌షా నాల్గవ కుమా రుడు ఇబ్రాహీం ఖులీఖుతుబ్‌షా పరిపాలనా కాలంలో అనగా క్రీ. శ. 1562 లో నిర్మింపబడిందని చెప్పబడు తున్నది. ఈ రిజర్వాయర్ నిర్మాణం తరువాత చాలాకాలా నికి మూసీనది ఒడ్డున ప్రస్తుతం హైద్రాబాదు నగరం ఏర్ప డింది. అందుచేతనే హుసేన్‌సాగర్ చెరువు చుట్టూ దిన దినమూ విస్తృత మవుతున్న హైద్రాబాదు శికింద్రాబాదు నగరాలు వున్నవి. రాజధానీ నగరానికి ఈ రిజర్వాయరు శోభను చేకూర్చుతున్నది

మూసీకి ఉపనదియైన కల్వలేరుకు కట్ట నిర్మింపబడ డంతో హుసేన్ సాగర్ రిజర్వాయర్ ఏర్పడింది. ఈకట్ట పొడవు ఒకమైలు. నీటివైపు రాతిగోడ, వెనుకవైపు మట్టి కట్టతో ఇది నిర్మింపబడింది. కట్టపైన రోడ్డు వెడల్పు 40 అడుగులు మొదలు 60 అడుగులవరకూ వున్నది ఇది చక్కని సిమెంటు కాంక్రీటురోడ్డు కట్ట పొడుగునా నీట వైపు ఎత్తైన తిన్నె వుంది. ఈ తిన్నెపై అచ్చటచ్చటా బెంచీలు అమర్చబడి వున్నవి. విహారార్థం వెళ్ళినవారు వాటిపై కూర్చొని గంటలతరబడి విశాలమైన నీటిదృశ్యాన్ని చూస్తూ ఆనందించవచ్చు కట్ట నడిమయంలో దావూద్ జంగ్ పెవెలియన్ అనే మంటపం ఒకటి నిర్మింపబడింది. వాహ్యాళికి వచ్చినవారు కూర్చోవడాని కిదిఅనువైన స్థలము సాయంత్రం వేళల హైద్రాబాదు, సికింద్రాబాదు నగరముల



పాఖాల చెర్వు

పౌరులు వందలకొలది ఈ కట్టపైకి (దీనినే టాంక్ బండ్ అనికూడా అంటారు) వాహ్యాళిక వస్తూ వుంటారు.

ఈ రిజర్వాయర్ నీటిని ఫిల్టరు చేయకుండా నగరంలోని తోటలకు, ఫ్యాక్టరీలకు సరఫరా చేస్తున్నారు. దీనిక్రింద కొంత భూమికూడా సాగవుతున్నది.

## ఉస్మాన్ సాగర్

కృష్ణానదికి గల ఉపనదులలో మూసీ పెద్దది. ఇది హైద్రాబాదు నగరంగుండా ప్రవహిస్తున్నది. క్రీ. శ. 1908 లో మూసీకి పెద్ద వరదవొచ్చింది. ఆ వరదవల్ల ఎంతో జననష్టం, ఆస్తినష్టం సంభవించింది. ఆ తరువాత మళ్ళీ అట్టి విపర్యయం సంభవించకుండా నిరోధించడానికై నగరానికి పైన కొంతదూరంలో మూసీనదిపై ఒకటి, దాని ఉపనదియైన ఏసీవాగుపై ఒకటి—ఇలా రెండు వరద నిరోధక రిజర్వాయర్లను నిర్మింపవలెనని ఒక పథకం వేయబడింది. మూసీపై కట్టబడిన రిజర్వాయరుకు "ఉస్మాన్ సాగర్" అని పేరు పెట్టబడింది.

మొత్తం 50 లక్షల రూ. ల ఖర్చుతో 1920 లో ఉస్మాన్ సాగర్ నిర్మింపబడింది. ఇది మొదట వరదను నిరోధించే ఉద్దేశంతోనే కట్టినప్పటికీ ఇప్పుడు హైద్రాబాదు సికింద్రాబాదు నగరాలకు అవసరమైన మంచినీరుకు ఇదే ఆధారంగా వున్నది. రిజర్వాయరునుంచి నీటిని కాండిట్ గుండా ఫిల్టర్ బెడ్లకు ఎక్కించి అక్కడనుంచి నీరు ఉభయనగరాలకు సప్లయి చేయబడుతుంది. ఈ సప్లయి సిస్టం నిర్మాణానికి 50 లక్షల రూ. లు ఖర్చు అయ్యాయి.

రిజర్వాయరు కట్ట పొడవు మైలుకంటె ఎక్కువగానే వున్నది. అందులో సగభాగం గ్రేవిటీరకం రాతికట్ట. మిగిలింది మిశ్రమమైన కట్ట. అంటే రాతిగోడకట్టి దానికి ఆదరువుగా వెనుక మట్టి దట్టించబడింది. కట్ట పైభాగం వెడల్పు 18 అడుగులు. దీనిపై మోటార్లు వెళ్ళడానికి చక్కని రోడ్డు వేయబడింది. కట్ట గ్రేవిటీ భాగంలో వర్షా కాలంలో వచ్చే వరదనీటిని వదలడానికై వరదతలుపు లమర్చబడినవి. రిజర్వాయరు పూర్తిగా నిండినప్పుడు అందులో 13,000 యం. సి. అడుగులనీరు 10 చదరపు మైళ్ళ విస్తీర్ణంలో వ్యాపించి వుంటుంది.

కట్ట ఎడమ చివరన అందమైన ఉద్యానవనం వుంది. ఈ వనం చెరువు గర్భంలోకి చొచ్చుకొనిపోయివుంది. ఇది హైద్రాబాదు సికింద్రాబాదు వాసులకు సెలవు రోజులలో పిక్నిక్ పార్టీలకు, వనభోజనాలకూ వెళ్ళడానికి ఎంతో తగివుంది. ఇంకా చివరకు వెళ్ళితే పెద్ద అతిధిగృహం ఒకటి వున్నది. అందులో నాలుగు గదులున్నవి. మకాం చేయదలచుకున్నవారికి అన్ని ఆధునిక సౌకర్యాలు అందులో అమర్చబడి వున్నవి. దీనికి దగ్గరగా ఒక ఇన్‌స్పెక్షన్ బంగళావుంది. దానికికూడా రెండు గదులున్నవి. సెలవు రోజుల్లో అతిథి గృహమూ ఇన్‌స్పెక్షన్ బంగళా ఎప్పుడూ నిండివుంటాయి, కనుక వలసినవారు వాటిని ముందుగానే తమకు కేటాయింప జేసుకోవాలి. లేకపోతే ఆశాభంగమే. రిజర్వాయరు, అతిథి గృహము, ఇన్‌స్పెక్షన్ బంగళా, పి. డబ్ల్యు. డి. వారి అజమాయిషీ క్రింద వున్నవి.

ఉస్మాన్ సాగర్ రిజర్వాయరు హైద్రాబాదు నగరానికి పడమటివైపున 16 మైళ్ళ దూరంలోవుంది. రిజర్వాయరు వరకు మోటార్లు పోవడానికి చక్కని రోడ్డువుంది. ఈ రోడ్డుపై ఇటీవలే బ్లాక్‌టాప్ వేయబడింది. రిజర్వాయరు వరకు ప్రభుత్వంవారు నడుపుతున్న బస్సులుకూడా వున్నవి.

## హిమాయత్ సాగర్

ఉస్మాన్ సాగర్ ప్రాజెక్టు జంటరిజర్వాయర్లలో ఇది ఒకటి. ఉస్మాన్ సాగర్‌తోపాటు ఇదికూడా వరద నిరోధక పథకంగా నిర్మింపబడింది. ఇది ఏసీవాగుపై నిర్మింప బడింది. ఏసీవాగు హైద్రాబాదు నగర శివార్లలో మూసీ నదిలో కలుస్తుంది. దాదాపు 80 లక్షల రూ. ల వ్యయంతో 1926 లో హిమాయత్ సాగరు రిజర్వాయరు నిర్మింప బడింది.

రిజర్వాయరు డాము పొడవు $1\frac{1}{3}$ మైలు పొడవు. ఇది మిశ్రమడాము. ముందరివైపు రాతికట్ట, వెనుకవైపున మట్టి దట్టింపు వేయబడింది. కట్టపై మోటార్లు పొయ్యేందుకు రోడ్డువుంది. వర్షాకాలంలో వరదనీటిని వదలివేయడానికై డాముకు 17 గేట్లు (తలుపులు) అమర్చబడ్డవి.

ఉస్మాన్‌సాగరు రిజర్వాయరు వలెనే హిమాయత్ సాగరు రిజర్వాయరు కూడా రెండు ప్రయోజనాల నిమిత్తం నిర్మింపబడింది. ఒకటి వరదను అరికట్టడం, రెండవది హైద్రాబాదు నగరానికి నీరు సరఫరా చేయడం. హిమాయత్ సాగరు కుడివైపున నీటి సరఫరా తూముకు వెనుక భాగంలో హైద్రాబాదు ఇంజనీరింగు పరిశోధన ప్రయోగ శాలను నెలకొల్పవలెననే ప్రతిపాదన ఒకటివుంది. ఆ ప్రయోగశాల తాలూకు హైడ్రాలిక్సు విభాగం అప్పుడే ఇక్కడికి మార్చబడి, ఇక్కడే పనిచేస్తూ వున్నది. దీనికి దిగువ కొన్ని ఫర్లాంగుల దూరంలో వ్యవసాయ క్షేత్ర

మొకటివుంది. ప్రయోగశాల తాలూకు హైడ్రాలిక్ విభాగము, వ్యవసాయ క్షేత్రము హిమాయత్‌సాగరు నీటి సప్లయి తూమునుంచి వొచ్చే నీటిని తమ అవసరాల నిమిత్తం వినియోగించి మళ్ళీ ఎక్కువ తరుగుపోకుండా ఆనీటిని కాలువలోకి వదులుతవి. సమీపంలోనే హైడ్రాలికు విభాగము, వ్యవసాయ క్షేత్రమూ వుండడంచేత హిమాయత్ సాగరు ప్రదేశం చూడదగివున్నది.

హైద్రాబాదు నగరానికి ఆగ్నేయ దిశన 12 మైళ్ళ దూరంలో హిమాయత్ సాగర్ వుంది. ప్రాజెక్టు స్థలం వరకు నిత్యం ప్రభుత్వ బస్సులు నడుస్తూ వుంటాయి. హిమాయత్‌సాగర్‌కూ, ఉస్మాన్ సాగర్‌కు నేరుగా రోడ్డు కూడా వుంది. కట్టకు ఎడమ ప్రక్కన అతిధిగృహం వుంది. దానికి నాలుగు గదులున్నవి. ఈ రిజర్వాయరును చూడదలకున్న వారికి అతిధి గృహంలో అన్ని సౌకర్యాలు అమర్చబడ్డవి.

## మీర్ ఆలం చెరువు

ఇది చిన్నచెరువైనా చారిత్రక ప్రాముఖ్యంగలది. హైద్రాబాదు నగరశివార్లలో హిమాయత్‌సాగర్‌నుంచి వెనుకకు వచ్చే దారిలో ఈ చెరువు వుంది. మహబూబ్‌నగర్ రోడ్డు నుంచి రెండువందల గజాల దూరంలోనే ఇది వుంది.

శ్రీరంగపట్నాన్ని జయించిన తరువాత లభించిన ధనంతో క్రీ. శ. 1806 లో మీర్ ఆలం రిజర్వాయర్ నిర్మింపబడిందని చెప్పబడుతున్నది. క్రీ. శ. 1799 లో మ. ఘ. వ. నిజాముకూ మైసూరుకూ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో మీర్ ఆలం అనునాతడు హైద్రాబాదు సంస్థానానికి సర్వసైన్యాధిపతిగా వున్నాడు. శ్రీరంగపట్నం పతనమైంది. టిప్పుసుల్తాన్‌ను చంపి వేశారు. ఆ యుద్ధం తరువాత మీర్ ఆలం బాగా డబ్బు, సంపద దోచుకొని హైద్రాబాదుకు తిరిగి వొచ్చాడు. అయితే ఆ తరువాత ఎందుచేతనోగాని వ్యాకుల చిత్తుడై, ఆత్మ సంతృప్తి నిమిత్తమై తన ధనాన్నంతా దాన ధర్మాలకూ, ప్రజాహితకార్యాలకూ వినియోగించాడు. ఫలితంగా హైద్రాబాదునుంచి మచిలీపట్నంవరకు సత్రాలు, విశ్రాంతి కేంద్రాలు ఏర్పడ్డవి. వాటితోపాటు పాత హైద్రాబాదు నగరానికి నీటి సరఫరా నిమిత్తమై మీర్ ఆలం చెరువుకూడా నిర్మింపబడింది.

నిర్మాణరీత్యా మీర్ ఆలం చెరువు అసమాన మైనది. దీని డాము అనేక కమానులతో రూపొందించబడింది. జాన్ కంపెనీకి చెందిన ఫ్రెంచి ఇంజనీరొకడు ఈ చెరువు డిజైనును తయారు చేశాడట. అయితే ఎందుచేతనోగాని అతని పేరుమాత్రం బైటికి రాలేదు. నిట్రముగాను, అర్ధ వలయా కారంగాను, వున్న కమానులు దాదాపు ఇరవై ఒకటి దీని కట్టకున్నవి. ఈ కమానుల మధ్యదూరం 70 అడుగులు మొదలుకొని 147 అడుగులవరకూ వున్నది. ఎత్తు గరిష్ఠం 40 అడుగులు. కమానులు వాటికి అండగా వున్న స్తంభాలకు ఆనుకొని వుంటాయి. మిగులు నీరు డాముపై నుంచి వెళ్ళిపోతుంది.

ఒక కమానుకూ మరొకమానుకు మధ్యగల దూరం సమంగా లేనప్పుడుకమానులు అర్ధవలయాకారంలో నిర్మించడం సముచితంగావుందని ప్రవీణులు చెబుతారు. ఎందుచేతనంటే అలాటి కమానులు నీటి వత్తిడికి తట్టుకొని నిలువ గలుగుతాయట.కమానులు ఆధారంగా నిర్మింపబడ్డ డాములు చాలాతక్కువ. దాదాపు నూరేళ్ళ ఈమధ్య మళ్ళీ ఇటువంటి డాము మనదేశంలో ఎక్కడా నిర్మింప బడలేదు. అందుచేతనే మీర్ ఆలం డాముకు ఒక విశిష్టత వుంది. యూరపు ఖండ ఇంజనీర్లు, అమెరికన్ ఇంజనీర్లు ఇట్టి డాముల విషయమై పరిశోధనలు చేయడానికికూడా ఈ డామే ఆధారమైంది. కనుకనే నీటి వనరుల నిర్మాణానికి సంబంధించిన ప్రమాణబద్ధమైన పాఠ్యపుస్తకాలలో మీర్ ఆలం డాము ప్రత్యేకంగా పేర్కొనబడింది.

అయితే ఇది చిన్న రిజర్వాయరు కావడంచేత హైద్రాబాదు నగరానికి సరిపొయ్యే నీటిని ఇదొక్కటే సరఫరా చేయజాలదు. ఉస్మాన్‌సాగర్‌కు సహాయకంగా ఇదికూడా ఉపకరిస్తున్నది. హిమాయత్‌సాగర్‌నుంచి తీయబడ్డ నీటి సరఫరా కాల్వను ఇరసాలగండి కాలువ అంటారు. ఆ కాలువనుంచి నీటిని మీర్ ఆలం చెరువులోకి పెట్టి, అక్కడి నుంచే నీటిని ఫిల్టర్ బెడ్లకు ఎక్కించి, ఆ మీదట పట్టణానికి సప్లయి చేస్తారు.

డాము కుడిచివర పి. డబ్ల్యు. డి. ఇన్‌స్పెక్టరు బంగళా వుంది. అక్కడినుంచిచూస్తే రిజర్వాయర్‌దృశ్యం చక్కగా కన్పిస్తుంది. ఈ బంగళాకు సమీపంలో ఒక విశ్రాంతి గృహం వుంది. అది సుందరమైన ఉద్యానవనంలో వున్నది. దానిని ఇటీవలే సాలార్జంగ్ ట్రస్టువారు యాత్రికుల సౌకర్యార్ధమై తెరిచారు.

## నిజాంసాగర్ ప్రాజెక్టు

జిల్లాలలోని ప్రాజెక్టులలో నిజాంసాగర్‌ప్రాజెక్టు అన్నిటికంటె పెద్దది. తెలంగాణాలో ఇంతవరకు నిర్మింపబడ్డ

ప్రాజెక్టులలో ఇది గొప్పది. ఇది నిజామాబాదు జిల్లాలో వుంది. మంజీరా నదికి ఇది కట్టబడింది.

మంజీరా నదిలో ప్రతిసంవత్సరం దాదాపు 6 లక్షల ఎకరాలను సాగుచేయగల నీరు ప్రవహిస్తూ వుంటుంది. నిజాంసాగర్ ప్రాజెక్టు నిర్మాణానికి పూర్వం ఈ నదిపై ఘనపురం దగ్గర చిన్న ఆనకట్ట వుండేది. అందుచేత మంజీరానది నీటిని హెచ్చుగా వినియోగానికి తెచ్చే ఉద్దేశంతో పెద్ద రిజర్వాయర్లను నిర్మించి వాటినుంచి సాగు నీరునూ, విద్యుచ్ఛక్తినీ పొందడానికై ఒక పథకం తలపెట్టబడింది. అదే నిజాంసాగర్ ప్రాజెక్టు. ఈ ప్రాజెక్టు నిర్మాణంవల్ల ఇదివరకు మంజీరానదినీరు 2 శాతంమాత్రమే వినియోగింప బడుతూవుంటే ఇప్పుడు 50 శతి నీరు వినియోగింప బడుతున్నది. ఈ ప్రాజెక్టు నిర్మాణం 1924 లో ఆరంభమై 1932 లో పూర్తి చేయబడింది. మొత్తం 4 కోట్ల రూ. లు ఖర్చుఅయ్యాయి. నిజాంసాగర్ ప్రాజెక్టుకు ఎగువన 70 మైళ్ళ దూరంలో దేవనూరు గ్రామంవద్ద ఒక విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు త్వరలో నిర్మింప బడుతుంది.

నిజాంసాగర్ రిజర్వాయర్‌లో అన్నిటికంటె ముఖ్యమైన విశేషమేమిటంటే దీనిడాము బ్రహ్మాండమైనది. రాతితో నిర్మింపబడింది. డాముపొడవు రెండుమైళ్లు. డాముపైన మోటార్లు పోవడానికి 14 అడుగుల రోడ్డు వున్నది. భారతదేశంలో గ్రేనిటీ డాములలో ఇది అన్నిటికంటె పెద్దది. 106 అడుగుల లోతున మొత్తం 30,000 యం. సి. అడుగుల నీరు దీని రిజర్వాయర్‌లో వుంటుంది. ఆ నీరు దాదాపు 50 చదరపుమైళ్ళ విస్తీర్ణంమేరకు వ్యాపించివుండి అదొక మహా తటాకంలా కన్పిస్తుంది. ఒక క్రమంలేని చిన్నా పెద్ద రాళ్ళతో డాము నిర్మింపబడింది. కాని ముందర భాగంలో మాత్రం చెక్కినరాళ్ళు అమర్చబడ్డవి. ఘనపరిమాణం విషయంలో ఇది నిర్మింపబడుతున్న సమయంలో భారతదేశం మొత్తంలో ఇది రెండవ పెద్దడాము. మొదటిది దక్షిణభారతంలో కావేరినదికి కట్టబడిన మెట్టూరుడాము. రిజర్వాయరులోకి వచ్చే గరిష్ఠ వరదప్రవాహాన్ని (ఇది 4.7 లక్షల క్యూజెక్కులుంటుంది) బైటికి వదలడానికై ప్రత్యేకఏర్పాట్లు చేయబడినవి. ఈ ప్రవాహంలో ఎక్కువ భాగం 28 ఆటోమేటిక్ గేట్ల (వాతంతట అవే పైకిలేచే తలుపులు) ద్వారా బైటికి పంపివేయబడుతుంది. ఇవి అసలుడాముకు ఎడమవైపున 16, కుడివైపున 12 వున్నవి. ఇవి ఒక్కొక్కటి $40' \times 15\frac{1}{2}'$ అడుగుల కొలతతో $17\frac{1}{4}$ టన్నుల బరువు వుంటాయి. వీటికి రెట్టింపుకంటె ఎక్కువ బరువుగల కౌంటర్‌వెయిట్లతో కనెక్టు చేయబడి వుంటాయి. కౌంటర్ వెయిట్లను మరొకసాధనం పట్టుకొని వుంటుంది. పూర్తి రిజర్వాయర్ మట్టానికంటె నీరు 3 అంగుళాలు హెచ్చుగా వచ్చినట్లయితే అది వాటర్‌బ్యాలెన్సు మీదుగా ప్రవహిస్తుంది. అప్పుడు వాటర్‌బ్యాలెన్సు అనే సాధనం క్రిందికివంగి, క్లచిని విడుదలచేస్తుంది. అప్పుడు కౌంటర్ వెయిట్లు పడిపోయి. గేట్లు ఒకదానివెంట ఒకటి చకచకా లేచిపోతాయి. మొత్తం గేట్లన్నీ 30 సెకండ్లలో లేస్తాయి. ఇవిగాక ఒక్కొక్కటి $8' \times 15'$ అడుగుల పరిమాణంగల తూములున్నవి. వీటిద్వారా కూడా వరదనీరు బైటికి వెళ్ళిపోతుంది.

రిజర్వాయర్‌లో నిలువచేయబడిన నీరు భూముల సాగు నిమిత్తమై పెద్ద తూముద్వారా పెద్దకాలువలోకి వదలబడుతుంది. ఈ పెద్దతూము డాముకు మైలుదూరంలో వుంటుంది ఒక్కొక్కటి $8' \times 10\frac{1}{2}'$ అడుగుల పరిమాణంగల ఉక్కు గేట్లద్వారా అవసరాన్నిబట్టి నీటిసరఫరా క్రమబద్ధం చేయబడుతుంది. 93 మైళ్ళ పొడవు పెద్దకాలువ, బ్రాంచి కాలువలు, మొత్తం దాదాపు 1100 మైళ్ళ పొడవున్న పిల్ల కాలువలు ప్రాజెక్టుక్రింద 2, 75, 000 ఎకరాలకు సాగునీరు సరఫరా చేయడానికి ఉద్దేశించబడినవి. ఇటీవలనే సాగునీటి తూములకు కొంచెంక్రిందుగా జలవిద్యుచ్ఛక్తి యంత్రం నెలకొల్పబడింది. ఒక్కొక్కటి 5,000 కిలోవాట్ల శక్తిగల మూడు జెనరేటర్ల స్థాపనకై ఈ పథకం ఉద్దేశించబడింది.

నిజాంసాగర్ రిజర్వాయర్ హైద్రాబాదు నగరానికి వాయవ్యదిశన 90 మైళ్ళ దూరంలో నిజామాబాదులో వుంది. హైద్రాబాదు నగరంనుంచి రిజర్వాయరుకు నేరుగా రోడ్డువుంది. రిజర్వాయరుకు దగ్గరి రైల్వేస్టేషన్ కామారెడ్డి. ఈ స్టేషన్ హైద్రాబాదు-మన్మాడు రైలుమార్గంలో వుంది. స్టేషన్‌నుంచి రిజర్వాయరువరకు గల రోడ్డునిడివి 25 మైళ్ళు. హైద్రాబాదు నగరంనుంచీ, కామారెడ్డి స్టేషన్ నుంచి ప్రాజెక్టుస్థలానికి నిత్యం ప్రభుత్వబస్సులు నడుస్తూ వుంటాయి.

ప్రాజెక్టును దర్శించ వచ్చేవారికి చక్కని భోజనవసతి ఏర్పాట్లు చేయబడినవి. ఎడమవైపున అచ్చంపేట దగ్గర రెండంతస్తుల విశ్రాంతిగృహం వుంది. దానిలో ఆరు గదులున్నవి. విశ్రాంతిగృహానికి దగ్గరగా మంచి అందమైన ఈతకొలను వుంది. ఈ విశ్రాంతి గృహంగాక

డాముకు కుడిప్రక్కన మరొక అతిథిగృహం వుంది. దానిని "గుల్‌గష్త్" అంటారు. అందులో రెండుగదు లున్నవి. పెద్దతూముల దగ్గరకూడా దిల్‌కుషా అనే బంగళావుంది. ఇది మంచి అందమైన ఉద్యానవనంలో వుంది. ఉద్యానవనం రిజర్వాయర్ గర్భంలోకి చొచ్చుకొని వుంది. ఈ బంగళా ఇటీవల జలవిద్యుచ్ఛక్తి శాఖవారి ఇనస్పెక్షన్ బంగళాగా మార్చబడింది. "సాగర్‌దృశ్యం" అనేది చూడదగిన మరొకస్థలం. డాము ఎడమప్రక్కన ఎత్తైన కొండపై నిర్మింపబడిన చిన్నకట్టడం ఇది. అక్కడనుంచి చూస్తే రిజర్వాయరు, దాని పరిసరాలు చక్కగా కన్పిస్తాయి,

## పోచారం ప్రాజెక్టు

ఇది ఆలేరువాగుపై కట్టబడింది. ఈవాగు మంజీరకు ఉపనది. పోచారం ప్రాజెక్టు నిజాంసాగర్ ప్రాజెక్టుకు ఆగ్నేయదిశన 15 మైళ్ళ దూరంలో వుంది. దీని నిర్మాణం 1922 లో 30 లక్షల రూ. ల ఖర్చుతో పూర్తిచేయ బడింది.

రిజర్వాయర్ కట్టపొడవు $\frac{1}{4}$ మైలు పొడవున వుంటుంది. ఇది పూర్తిగా రాతితో నిర్మింపబడింది కట్టపై వెడల్పు 15 అడుగులు. అయితే దానిమీద రోడ్డు లేదు. డాము యొక్క రెండు విభాగాలు మిగులు నీటి కట్టలుగా పని చేస్తాయి. ఇవిగాక మిగిలిన వరదనీటిని పంపివేయడానికై $4' \times 6'$ పరిమాణంగల తూము లున్నవి. 50 అడుగుల ఎత్తున్న డామువల్ల దాదాపు 8 చదరపుమైళ్ళ విస్తీర్ణంలో 2,000 యం. సి. అడుగుల నీరు వుంటుంది.

రిజర్వాయరులోని నీరంతా భూముల సాగుకే వినియోగింప బడుతున్నది. కుడివైపున ఒక్కొక్కటి $3' \times 3'$ అడుగుల పరిమాణంగల ద్వారములు 4 వున్నవి. వీటి నుంచి కాలువ పోతుంది. కాలువ పొడవు 36 మైళ్ళు. పోచారం రిజర్వాయర్ మంచి అందమైన పరిసరాలలో వున్నది. సెలవు రోజుల్లో కులాసాగా గడుపదలచుకున్న వారికి ఇది మంచి అనువైనస్థలం. ఒక తోటలో ఇన్‌స్పెక్షన్ బంగళా వుంది. దానిలో రెండు గదు లున్నవి. ఈ బంగళా డాము కుడిచివరన వుంది. దానిపైనుంచి చూస్తే రిజర్వాయర్ మొత్తం కన్పిస్తుంది. ట్రావెలర్స్ బంగళాకూడా ఒకటివుంది. అందులో రెండు గదులున్నవి. ఇది చిన్న గుట్టమీద వుంది. మెదకు ఇర్రిగేషన్‌బ్రాంచి ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుతో సంప్రదించి ముందుగా బుకింగ్ చేసుకొని ప్రాజెక్టు చూడదలచుకున్నవారు ఈ రెండింటిలో దేనిలోనైనా బసచేయవచ్చును.

మెదకు పట్టణంనుంచి ఈ రిజర్వాయర్ 10 మైళ్ళ దూరంలో వుంది. ఈ పదిమైళ్ళ దూరమూ రోడ్డు వుంది. ప్రాజెక్టుకు దగ్గరి రైలుస్టేషన్ అక్కన్నపేట. అది హైద్రాబాదు - మన్మాడు రైలుమార్గంపై ప్రాజెక్టుకు 20 మైళ్ళ దూరంలో వుంది. రోడ్డుపై బస్సుసర్వీసు వుంది.

## దిండీ ప్రాజెక్టు

కృష్ణానదికి ఉపనది దిండి. దిండి తెలంగాణా ప్రాంతంలో మహబూబునగర్ జిల్లా హద్దుల లోపలనే ప్రవహిస్తుంది. దీనికి గుండాపల్లిగ్రామంవద్ద సాగునీటి ఆనకట్ట నిర్మింపబడింది. ఆనకట్టకు ఎడమవైపున ఒకటే కాలువ తీయబడింది. అది 1[illegible],000 ఎకరాలకు సాగు నీరు సప్లయి చేస్తుంది. ఈ ప్రాజెక్టు 40 లక్షల రూ ల ఖర్చుతో 1943 లో పూర్తి చేయబడింది.

ఈ రిజర్వాయరు డాములో ప్రత్యేకాంశ మేమిటంటే డాము సమతలమైన వంపులో నిర్మింపబడింది. అందు చేతనే రిజర్వాయరు దృశ్యం చూడడానికి బాగా వుంటుంది. కట్టపొడవు ఒక మైలు. దీనికి 1000 అడుగుల పొడవు ఓగీ స్పిల్వే వుంది. స్పిల్వే ప్రక్కన మట్టికట్ట వుంది. మట్టి కట్టపై వెడల్పు 12 అడుగులు. డాము ముందరి భాగపు ఏటవాలుభూమి వరదకు కోసుకుపోకుండా వుండడానికై సుర్కీ కాంక్రీట్ చట్టుతో సమతలం చేయబడింది. ఇదొక విశేషం. సెంట్రల్ ఓగిస్పిల్వే ఆటోమాటిక్ ఓపెన్ స్పిల్వేగా పనిచేస్తుంది. దానిపై రోడ్డుమార్గం లేదు. ఓగీ స్పిల్వేగాక మిగులునీటి వరదను బైటికి పంపడానికై కుడి ప్రక్కన 1000 అడుగులు, 700 అడుగుల కట్టలు వేరే వున్నవి. ఈ కట్టలుకూడా ప్రత్యేకంగా చెప్పుకోదగి వున్నవి.

మహబూబ్ నగర్ జిల్లాలో తాలూకా కేంద్రమైన కల్వకుర్తికి ఆగ్నేయ దిశన 19 మైళ్ళదూరంలో దిండీ రిజర్వాయరు వుంది. సికింద్రాబాదు - ద్రోణాచలం మీటర్‌గేజి లైనుపై జడ్చర్ల స్టేషన్‌నుంచి 45 మైళ్ళదూరంలో ఈ రిజర్వాయరువుంది. ఇది జడ్చర్ల - దేవరకొండ పి. డబ్ల్యు. డి. రోడ్డుకు 14 మైళ్ళ దూరంలో వుంది. ఈ పి. డబ్ల్యు. డి. రోడ్డునుంచి రిజర్వాయరు దగ్గరికి మరొక చిన్నరోడ్డు వుంది. ఈ చిన్నరోడ్డు డాము దిగువగా పోయి అచ్చంపేట - అమరాబాదు పి. డబ్ల్యు. డి. రోడ్డుతో కలుస్తుంది.

డాము దగ్గరికి పొయ్యే చిన్నరోడ్డుపై సంవత్సరం పొడు గునా మోటారుకార్లు నడవవచ్చు.

రిజర్వాయరు ఎడమ ప్రక్కన అందమైన ఇన్‌స్పెక్షన్ బంగళా వుంది. దానిలో నాలుగు గదులు, ఫర్నీచర్ సామగ్రి వున్నవి. డాముకు రెండువైపులాగల ఓగీ స్పిల్వేపై వాచ్ టవర్ వుంది. దానిపైనుంచి చూస్తే రిజర్వాయరు దృశ్యం బాగా కన్పిస్తుంది. ముఖ్యంగా వర్షాకాలంలో రిజర్వాయరు నిండి మిగులు నీరు ఓగీ స్పిల్వేమీదుగా పొయ్యేదృశ్యం నేత్రోత్సవం చేస్తుంది.

కాలువ దారిలో ఒక వాగు అడ్డంవస్తుంది. దానిలో నుంచి కాలువ పోవడానికై బాపనకుంట అనే బ్యాలెన్సింగ్ రిజర్వాయరు నిర్మింపబడింది. ఇక్కడకూడా ఒక ఇన స్పెక్షన్ బంగళా వుంది. ఇది ఇటుకతో కట్టిన భవనంగా గాక పైకిచూస్తే రాళ్ళతో నిర్మితమైన మేడలాగ వుంటుంది. దీనికి "అజీంగఢ్" అని పేరు పెట్టారు. దిండీ రిజర్వా యరు ఇనస్పెక్షన్ బంగళా కంటె ఇక్కడ నిశ్శబ్దంగా ప్రశాంతంగా వుంటుంది గనుక సెలవుల్లో వెళ్ళదలచుకున్న వారికి ఇది మిక్కిలి అనువైనది.

## మానేరు ప్రాజెక్టు

మానేరు గోదావరికి ఉపనది. ఇది పూర్తిగా తెలంగాణా ప్రాంతంలోనే ప్రవహిస్తుంది. ఇది నిజామాబాదుజిల్లా ఉప్పలవాయివద్ద పుట్టి తూర్పువైపు 28 మైళ్ళు ప్రవహించి అక్కడ కరీంనగర్ జిల్లాలో ప్రవేశిస్తుంది. కరీంనగర్ జిల్లా సరిహద్దులో కుడ్లేరు అనే మరొకనది దీనితో కలుస్తుంది. ఈ రెండునదుల సంగమస్థానంలో మానేరు ప్రాజెక్టు కట్టబడింది.

మానేరు ప్రాజెక్టుడాము పొడవు 2 మైళ్ళు. మధ్యలో అరమైలు భాగంలో ఓపెన్ ఓగీస్పిల్వే వుంది. దానికి రెండుప్రక్కలా మిశ్రమడాము వుంది. ఓగ్ స్పిల్వే గాక వరదనీటిని బైటికి పంపివేయడానికై 1200 అడుగుల పొడవున యఫ్. ఓ. యఫ్. కట్టవుంది. డాముఎత్తు 70 అడుగులు. రిజర్వాయర్‌లో 3,000 యం. సి. అడుగుల నీరు వుంటుంది. ఇది అంతా భూములకే ఉపయోగింప బడుతుంది. పెద్దతూముకు కుడివైపున ఒక్కొక్కటి $4' \times 6'$ అడుగులు పరిమాణంగల ద్వారములు మూడు వున్నవి. అక్కడనుంచి కాలువ తీయబడింది. కాలువ పొడవు 23 మైళ్ళు. దీనిక్రింద కరీంనగరు జిల్లాలో 17000 ఎకరాలు సాగు అవుతాయి.

ఈ ప్రాజెక్టు దాదాపు కోటి రూపాయల ఖర్చుతో 1950 లో నిర్మింపబడింది.

దీని రిజర్వాయరు హైద్రాబాదు- మన్మాడు రైలుమార్గంపై గల కామారెడ్డి స్టేషన్‌కు తూర్పున 25 మైళ్ళ దూరంలో వుంది. కరీంనగరు - కామారెడ్డి పి. డబ్ల్యు. డి. రోడ్డునుంచి రిజర్వాయరు వరకు చిన్న రోడ్డువుంది. ఈ రోడ్డుపై నిత్యం బస్సులు నడుస్తూ వుంటాయి.

రిజర్వాయరుకు ఎడమవైపున యాత్రికులకు, తనిఖీచేసే అధికారులకు అతిథిగృహం వుంది.

తెలంగాణా ప్రాంతంలో పైన చెప్పబడిన నదీలోయ ప్రాజెక్టులేగాక దర్శనీయమైన మరికొన్ని ప్రాజెక్టు ప్రదే శాలుకూడ వున్నవి. వాటి సంక్షిప్త వివరణ దిగువన ప్రస్తావించబడింది.

## పాఖాల, రామప్ప, లక్నవరం చెరువులు

వీటిని క్రీ. శ. 13 వ శతాబ్దిలో కాకతీయరాజులు నిర్మించా రని చెప్పబడుతున్నది.

వరంగల్లును పరిపాలించిన కాకతీయవంశ రాజులు చరిత్ర ప్రసిద్ధులు. వారిలో గణపతిదేవుడు వాసికెక్కిన వాడు. ఈయన క్రీ. శ. 1199 నుంచి 1260 వరకు 62 ఏండ్లు పరిపాలన చేశాడు. కాకతీయులకు పూర్వం పరి పాలన చేసిన చాళుక్యులు దేవాలయ నిర్మాతలుగా ప్రసిద్ధి జెందినారు. కాని కాకతీయులు దేవాలయాలనేగాక ప్రజోప యోగకరమైన నిర్మాణాలనుకూడా చేపట్టారు. భారతదేశంలో మొట్టమొదటిసారిగా వీరే తటాకములను నిర్మింపజేసి భారీ ఎత్తున భూములసాగుకు అవకాశం కల్పించారు. నేటికాలపు నదీలోయ ప్రాజెక్టులకు ఆనాడు కాకతీయ పరిపాలకులు కట్టించిన తటాకములు ఆదర్శప్రాయ మైనవి.

పాఖాల, రామప్ప, లక్నవరం చెరువులు ప్రకృతి సిద్ధ మైన పరిసరాలలో వుండడంచేత అవి మానవ నిర్మితమైన తటాకములుగా కన్పించవు. కనుకనే వాటిని సరస్సు లన్నారు. ఈ ప్రాచీన సరస్సుల సౌందర్యం వర్ణింప నలవికానిది. అయితే ఇవి వన్యమృగాలు నివసించే అడవి ప్రాంతంలో వుండడంచేత సరస్సుల దగ్గరనే చూడవచ్చిన వారికి నివాస వసతికి ఏర్పాట్లులేవు కాని సాల్వాయి, ములుగు, పాలంపేట, నరసంపేటలలో ఇనస్పెక్షన్ బంగళా లున్నవి. ఆ బంగళాలలో వసతి ఏర్పాటు చేసుకొని పగలు వెళ్ళి ఈ సరస్సులను చూడవచ్చు.

ఈ సరస్సులవద్ద అడవి మృగములవేటకు మంచి అవకాశాలున్నవి. అయితే అందుకు ముందుగా అటవీశాఖవారి అనుమతి పొందవలెను.

## వైరా, పాలేరు రిజర్వాయర్లు

ఇవి మధ్యరకపు సాగునీటి ప్రాజెక్టులు. ఇవి ఖమ్మం జిల్లాలో వున్నవి. ఈ శతాబ్ది మూడవ దశాబ్దిలో వీటి నిర్మాణం జరిగింది. పాలేరు ఖమ్మంమెట్టుకు పడమట 15 మైళ్ళ దూరంలోను, వైరా ఖమ్మంమెట్టుకు తూర్పున 25 మైళ్ళ దూరంలోను వున్నవి. ఖమ్మంనుంచి సూర్యాపేటకు పొయ్యే పి. డబ్ల్యు. డి. రోడ్డు పాలేరు రిజర్వాయర్ కట్ట మీదుగా పోతుంది. ఖమ్మంమెట్టునుంచి అశ్వారావుపేట వెళ్ళే పి. డబ్ల్యు రోడ్డు వైరా రిజర్వాయరు ప్రక్కగా వెళ్లతుంది. ఈ రోడ్లపై ప్రభుత్వబస్సులు నడుస్తూ వుంటాయి.

పాలేరు కట్ట పూర్తిగా మట్టికట్ట. కాని వైరాకట్ట సగం మట్టితోనూ సగం రాతితోనూ నిర్మింపబడింది. ఈ రిజర్వాయర్ల విషయంలో ఒక ప్రత్యేకత ఏమిటంటే వరదనీరు వెళ్ళిపోవడానికై వీటికి ఆటోమేటిక్ గేట్లు అమర్చబడ్డవి.

వైరాలోను, పాలేరులోను చూడవచ్చినవారు నివసించడానికి ఇనస్పెక్షన్ బంగళాలున్నవి.

## కోయిలసాగర్ ప్రాజెక్టు

ఇదిమహబూబునగర్ జిల్లాలో గల మధ్యరకం ప్రాజెక్టు. ప్రథమ పంచవర్ష ప్రణాళిక క్రింద ఇటీవలనే ఇది పూర్తి చేయబడింది. మహబూబ్‌నగర్‌కు పడమట 13 మైళ్ళ దూరంలో వుంది. హైద్రాబాదు - రాయచూరు రోడ్డుపై 76 వ మైలురాయినుంచి ఈ రిజర్వాయరువరకు 7 మైళ్ళ అప్రోచ్‌రోడ్డు వుంది. ఈ రోడ్డుపై ప్రభుత్వ సర్వీసు వుంది.

చరిత్రప్రసిద్ధమైన కోయిలకొండ గ్రామానికి సమీపంలో పెద్ద వాగుకు ఈ రిజర్వాయరు నిర్మింపబడింది. పెద్దవాగు కృష్ణానదికి ఉపనది. కోయిలకొండ పేరుతోనే ఈ రిజర్వాయరుకు కోయిలసాగర్ ప్రాజెక్టు అని వ్యవహరింపబడుతున్నది. ఈ రిజర్వాయరుచుట్టూ ఎత్తైన గుట్ట లుండడం చేత దీని దృశ్యం, ముఖ్యంగా సెంట్రల్ ఓగీ స్పిల్వే పైగా నీరు ప్రవహించునప్పుడు చూడదగింది. ఇక ఇంజనీరింగు దృష్ట్యాచూస్తే ఓగీ స్పిల్వేకు దిగువన గల శక్తిని చెదరగొట్టు ఏర్పాట్లు ప్రత్యేకంగా చెప్పుకోదగినవి. ఇవి ప్రత్యేకమైన ఇంటర్ ఆక్టింగ్ జెట్ డిస్సిపేషన్ ప్రత్యేక రకాలు. వీటిని మొదట హైద్రాబాదు ఇంజనీరింగ్ ప్రయోగశాల తయారు చేసింది.

డాముకు ఎడమ చివరన చిన్న గుట్టపై అతిధిగృహం ఒకటి వుంది. రిజర్వాయరును చూడ వెళ్ళినవారు అందులో బసచేయవచ్చు.

పైన చెప్పబడిననదీలోయ ప్రాజెక్టులు పూర్తి అయి భూములసాగుకు ఉపయోగపడుతున్నవి. అవిగాక తెలంగాణాలో మరి రెండు ప్రాజెక్టులున్నవి. వాటి నిర్మాణం ఇప్పుడు పూర్తి కావస్తున్నది. వాటి వివరాలు ఇవి :

## కడం ప్రాజెక్టు

గోదావరికి ఉపనదియైన కడంవాగుపై ఈ రిజర్వాయరు నిర్మింపబడింది. ఇది మొదట గోదావరి ఉత్తర కాలువకు బ్యాలెన్సింగ్ రిజర్వాయరుగా కృష్ణాపురం వద్ద నిర్మించవలెనని తలపెట్టిన ప్రధాన గోదావరి ప్రాజెక్టునుంచి నీటిని పొందే రిజర్వాయరుగా వుండవలెనని తలపెట్టబడింది. అయితే ఆ తరువాత మెయిన్ గోదావరి ప్రాజెక్టు ప్రతిపాదనలలో మార్పు చేయబడింది. అందుచేత స్వతంత్రంగా కడం రిజర్వాయరు నిర్మాణం చేపట్టబడింది.

రిజర్వాయరు డాము నిర్మాణం దాదాపు పూర్తిచేయబడింది. సెంట్రల్ ఓగీ స్పిల్వేపై వంతెన నిర్మాణం పూర్తి కావస్తున్నది. ఓగీపై వరద తలుపులు పెట్టవలసివున్నది. పెద్దకాలువ దాని ఉపకాలువలు చాలావరకు త్రవ్వబడినవి. కొన్ని భూములకు నీరుకూడా వదలబడుతున్నది. తెలంగాణాలో నిజాంసాగరు రిజర్వాయరు తరువాత ఇది పెద్ద రిజర్వాయరు.

ఇది అదిలాబాదు జిల్లాలో నిర్మల్ - లక్సెట్టీపేట పి. డబ్ల్యు. డి. రోడ్డుకు సమీపంలో వుంది. ఓగీపై వంతెన నిర్మాణం పూర్తి అయిన తరువాత పైరోడ్డు కడం డాము మీదుగా తీసుకుపోబడుతుంది. పైరోడ్డుమీద ప్రభుత్వ బస్సు సర్వీసు వుంది. నిర్మల్ పట్టణం అదిలాబాదు జిల్లాకు పి. డబ్ల్యు. డి. హెడ్ క్వార్టర్సు. హైద్రాబాదు - నాగపూరు జాతీయ రహదారి (నెం. 7) పై 134 వ మైలువద్ద నిర్మల్ వుంది. నిర్మల్‌కు తూర్పున 32 మైళ్ళ దూరంలో కడం రిజర్వాయరు వుంది.

ప్రాజెక్టును చూడవచ్చినవారు, తనిఖీకి వచ్చిన ఆఫీసర్లు వుండడానికై ఒక పెద్ద బంగళా విశ్రాంతి గృహంగా ఉపయోగింప బడుతున్నది. ప్రాజెక్టు నిర్మాణం పూర్తి అయిన తరువాత ఈ విశ్రాంతిగృహం ప్రాజెక్టును సంద

ర్శింప వచ్చినవారు నివసించటానికి కేటాయింప బడుతుంది. దీనిలో ఆధునిక సౌకర్యాలన్నీ వుండగలవు.

ఈ ప్రాజెక్టు సమీపంలో కూడా అడవి మృగాలను వేటాడడానికి అవకాశమున్నది. అయితే ముందుగా అటవీ శాఖవారి అనుమతి పొందవలెను.

## సరళాసాగర్ ప్రాజెక్టు

ఇది మహబూబ్‌నగరు జిల్లాలో పెద్దవాగుకు ఉపనది యైన చిన్నవాగుకు నిర్మింపబడుతున్న చిన్న ఇర్రిగేషన్ ప్రాజెక్టు. హైద్రాబాదు-ద్రోణాచలం మీటరుగేజి రైలు మార్గంపైగల వనపర్తి రైలు స్టేషనునుంచి 6 మైళ్ళ దూరంలో ఈ ప్రాజెక్టువుంది. హైద్రాబాదునుంచి కర్నూలు పొయ్యే జాతీయ రహదారి (నెం. 7) ఈ ప్రాజెక్టుకు దగ్గిరగా పోతుంది. ఈ జాతీయ రహదారినుంచి ప్రాజెక్టుకు చిన్న రోడ్డువుంది. జాతీయ రహదారిపై బస్సు సర్వీసు వుంది.

సరళాసాగరు రిజర్వాయరు చిన్నదైనప్పటికీ ఇది భారతదేశంలోనేగాక ప్రపంచం మొత్తంలోనే పేరుపొంద వచ్చు. ఇంజనీరింగు దృష్ట్యా దీనికంత ప్రాముఖ్యంవుంది, వరదనీరును బైటికిపంపివేయడానికై దీనికి చాలా పెద్ద సైఫాన్ స్పిల్వేలు ఏర్పాటు చేయబడుతున్నవి. అంత పెద్ద స్పిల్వేలు ఇంతవరకు ఎక్కడా నిర్మింపబడలేదేమో. ఒకే వరుసలో 17 శాడిల్ టైప్ సైఫాన్ స్పిల్వేస్ వుంటాయి. అవి నాలుగు బ్యాటరీలుగా విభజింపబడుతాయి. ప్రతిదానికి ఒక బేబీ వాల్యూట్ సైఫాన్ వుంటుంది.

డాముయొక్క సైఫాన్ స్పిల్వేభాగం తప్ప మిగతా రిజర్వాయరు పనులన్నీ పూర్తి అయ్యాయి. స్పిల్వేపని ఇప్పుడు జరుగుతూవుంది. మొత్తం ప్రాజెక్టు వచ్చే సంవత్సరం పూర్తికావచ్చు.

డాముకు ఎడమప్రక్కన ఇన్‌స్పెక్టింగ్ ఆఫీసర్ల నిమిత్తమై ప్రస్తుతం చిన్న విశ్రాంతిగృహ మొకటి వుంది, ఇందులో రెండు గదులున్నవి. ప్రాజెక్టు పూర్తి అయిన తరువాత ఇది అన్ని వసతులుగల విశ్రాంతి గృహంగా మార్చబడుతుంది. అప్పుడు ఇందులో ప్రాజెక్టును దర్శించ వచ్చినవారు, యాత్రీకులు కూడా బస చేయవచ్చు.

* * * *

# అభివృద్ధి బ్లాకులలో రాష్ట్రమంత్రులు

*రాష్ట్ర ప్లానింగ్ మంత్రి శ్రీ వి. బి రాజు, రాష్ట్ర సంక్షేమమంత్రి శ్రీ డి. సంజీవయ్యగారలు ప్రణాళిక కార్యక్రమాల అమలునుగూర్చి తెలుసుకోవడానికై పోయిన నెలలో కర్నూలుజిల్లాలోని వివిధ అభివృద్ధికేంద్రాలను దర్శించారు. వారి పర్యటన విశేషాలు ఇవి :*

9-9-1957 తేదీన మంత్రులు నంద్యాలలోని కోళ్ళ పెంపకపు ప్రదర్శన కేంద్రాన్ని దర్శించి కోళ్ళు, పక్షిజాతుల పెంపకంపట్ల ప్రజలు ఆసక్తి చూపుతున్నందుకు వారిని అభినందించారు ఈ కేంద్రం మంచి పేరు సంపాదించింది గనుక దీనిని వ్యాపార సంస్థగా మార్చడం మంచిదని ప్లానింగు మంత్రి సూచించారు. కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రంలో 1400 కేసులు నిర్వహింపబడినవి వాటిలో నూటికి 65 వంతులు విజయవంతమైనవి.

ఆ తరువాత మంత్రులు గిద్దలూరు వెళ్ళారు. అక్కడ ప్లానింగు మంత్రి ప్రసంగిస్తూ అధికాహారోత్పత్తిని సాధించవలసిన ఆవశ్యకతను బ్లాకు ఉద్యోగులకు వివరించి చెప్పారు బ్లాకులలో ప్రారంభింపబడిన సామాజికాభివృద్ధి కార్యక్రమాల విషయమై చర్చలు జరిగాయి.

10-9-1957 తేదీన మంత్రులు గిద్దలూరులోని మొక్కల పెంపకపు నమూనా కేంద్రాన్ని దర్శించారు. ఇది ఫలవృక్షముల తోటగా కూడా ఉపకరిస్తుంది రకరకాల మొక్కల ప్రదర్శనకూ, వాటిని జాతీయ విస్తరణ సేవా కేంద్రాలకూ, సామాజికాభివృద్ధి బ్లాకులకూ సప్లయి చేయడానికీ ఈకేంద్రం ఒక వ్యాపార సంస్థగా పనిచేస్తుంది ఆ తరువాత మంత్రులు కంచిపల్లెలోని



*కర్నూలు జిల్లా ముటుకూరు గ్రామానికి 11-9-1957 తేదీన రాష్ట్రమంత్రులు విచ్చేసినప్పుడు వారి ప్రసంగాలను వినడానికి వచ్చిన గ్రామీణులు.*



*10-9-1957* తేదీన కర్నూలు జిల్లాలోని బోయలకుంట్ల భూములను మంత్రులు చూచారు.

చర్మకార పరిశ్రమను తనిఖీచేశారు. ఇది తోళ్ళ ఊన కానికీ, తోలు సరుకుల తయారీకి కేంద్రంగా వున్నది. అక్కడ ప్లానింగు మంత్రి మాట్లాడుతూ తాలూకా అవసరాలను తీర్చడానికై ఉమ్మడి తోళ్ళ సరుకుల ఉత్పత్తి కేంద్ర మొకదానిని స్థాపించాలన్నారు. సామాజికాభివృద్ధి కార్యక్రమం వల్ల పూర్తిగా మేలుపొంది, తమ గ్రామాలను అభివృద్ధి పరచుకోవలసిందని గ్రామస్తులకు హితవు చెప్పారు. ప్లానింగుమంత్రి స్త్రీలకొరకు ఏర్పాటుచేయబడిన పరనాలయానికి ప్రారంభోత్సవం చేశారు. సంఘ సంక్షేమ మంత్రి కమ్యూనిటీ రేడియో సెట్టుకు స్విచ్ ఆన్‌చేసి ప్రారంభోత్సవం జరిపారు. ఈ రేడియో సెట్టు పంచాయితీ బోర్డుచే బహూకరింపబడింది. ఈ సభకు పరిసర గ్రామాలనుంచి చాలామంది ప్రజలు విచ్చేశారు. మంత్రులు తమ ప్రసంగాలలో మన జనాభాలో మహిళలు నూటికి 50 వంతుల చొప్పున వున్నారు గనుక వారు ముందంజవేసి జాతీయ నిర్మాణ కార్యక్రమంలో భాగస్వాములు కావలెనని ప్రబోధం చేశారు.

### ప్రజల విరాళం

ప్లానింగుమంత్రి బెస్తవారపుపేటలో జాతీయ విస్తరణ సేవాకేంద్రం కార్యాలయ భవనానికి శంకుస్థాపన చేశారు. గ్రామస్తులు 5.52 ఎకరాల స్థలాన్ని విరాళంగా ఇచ్చారు. ఇక్కడ పెద్ద బహిరంగసభలో ప్రసంగిస్తూ ప్లానింగుమంత్రి అభివృద్ధి కార్యక్రమాల ప్రాముఖ్యాన్ని వివరించి, అధికోత్పత్తికి ప్రాధాన్య మివ్వమని రైతులకు హితవు చెప్పారు. సంఘ సంక్షేమమంత్రి ప్రసంగిస్తూ కేంద్ర భవనానికి స్థలం ఉచితంగా ఇచ్చినందుకు గ్రామప్రజలను అభినందించారు.

బోయలకుంట్లలో ప్రజలు భారత సేవక్ సమాజ్ అధ్వర్యంక్రింద సాగునీటి కాలువను నిర్మించారు. ఈ కాలువక్రింద 600 ఎకరాల ఆయకట్టు వుంది.

మంత్రులు ప్రసిద్ధ పుణ్యక్షేత్రమైన మహా నందిని దర్శించి ఆ తరువాత గోపవరం వెళ్ళారు. అక్కడ నంద్యాల అనంతర తీవ్ర కృషి బ్లాకు అధ్వర్యాన గ్రామస్తులు నిర్మించిన పాఠశాల భవనానికి ప్లానింగుమంత్రి ప్రారంభోత్సవం జరిపారు. పాఠశాలభవనం నిర్మించుకున్నందుకు గ్రామస్తులను మంత్రులు అభినందించారు.



కర్నూలులో 12-9-57 తేదీన శ్రీ వి. బి. రాజు రాష్ట్ర శాసనసభ్యులతో చర్చలు జరుపుతున్న దృశ్యం.



కర్నూలుజిల్లాలోని నన్నూరు ప్రాథమిక పాఠశాలలో 9-9-57 తేదీన రాష్ట్రమంత్రులు వినోద కార్యక్రమం చూచారు.

ఆ తరువాత మంత్రులు నంద్యాలలోని ప్రాతిపదిక వ్యవసాయ పాఠశాలను, వ్యవసాయ పరిశోధనా కేంద్రాన్ని చూచారు. ఇక్కడి పరిశోధనా కేంద్రంలో మేలురకపు నూనెగింజల విత్తనపు జాతులను, జొన్న విత్తనపు జాతులనూ రూపొందించడానికి కృషి జరుగుతూ వున్నది. ప్లానింగు మంత్రి బ్లాకుసలహా సంఘ సమావేశంలో పాల్గొన్నారు. ఈ సమావేశానికి పంచాయితీల అధ్యక్షులు, సహకార సంఘాల అధ్యక్షులు కూడా వొచ్చారు. ప్లానింగు మంత్రి ప్రసంగిస్తూ అభివృద్ధి కార్యక్రమాలలో పంచాయితీలూ సహకార సంఘాల పాత్రను విశదీకరించారు మద్య నిషేధాన్ని ఎత్తివెయ్యాలన్న ప్రతిపాదనను తోసివేస్తూ మద్య నిషేధం పెట్టడంవల్ల పిన్న వయస్సువారికీ, స్త్రీలకూ ఎంతో మేలు చేకూరిందన్నారు.

11-9-1957 తేదీన మంత్రులు పెదపాడు సందర్శించి గ్రామ మందిరాన్నీ, మహిళా సంక్షేమ కేంద్రాన్నీ దర్శించారు. ఆ తరువాత పాలకుర్తి వెళ్ళారు అక్కడ ఒక రైతు మంత్రులను తన పొలానికి తీసుకెళ్ళి చూపాడు. రైతులు ఆధునిక వ్యవసాయ పద్ధతులు అవలంబిస్తున్నందుకు మంత్రులు సంతోషం వెలిబుచ్చారు. కొదునూరులో మంత్రులు ఒక సభలో ప్రసంగిస్తూ ప్రజలు తమ విభేదాలను విస్మరించి ఆధునిక పద్ధతుల ప్రకారం గ్రామాల అభివృద్ధికి కృషి చేయ వలసిందిగా ప్రబోధించారు.

దేవనకొండలో ప్లానింగు మంత్రి గ్రామ మందిరానికి ప్రారంభోత్సవం చేశారు. సంఘ సంక్షేమ మంత్రి పెద్ద రకపు సహకార సంఘాన్ని ప్రారంభించారు. మంత్రులు బ్లాకు సలహా సంఘ సమావేశంలో ప్రసంగించారు. సమావేశానికి పంచాయితీల అధ్యక్షులు, సహకార సంఘాల అధ్యక్షులు కూడా హాజరయ్యారు. ఆలూరులో ఒక సభలో ప్రసంగిస్తూ అధికాహారోత్పత్తిని సాధించి, వెనుకబడిన గ్రామాలను అభివృద్ధి పరచండని మంత్రులు విజ్ఞప్తిచేశారు సామాజికాభివృద్ధి బ్లాకువారు నడుపుతున్న కుట్టుపని కేంద్రాన్నీ, వడ్రంగంపని కమ్మరిపని కేంద్రాన్నీ, వాల్మీకి హాస్టలునూ, హరిజన హాస్టలునూ, బ్లాకు సమాచార కేంద్రాన్నీ చూచారు.

ప్లానింగుమంత్రి, బోర్డు ఎలిమెంటరీ స్కూలు భవనానికి ప్రారంభోత్సవం చేశారు. సంఘసంక్షేమమంత్రి రామదుర్గంలో బ్లాకు నిధులతో కట్టబడిన ఓవర్‌హెడ్ ట్యాంకికి ప్రారంభోత్సవం జరిపారు సామాజికాభి

[తరువాయి 47 వ పేజీలో]



కర్నూలుజిల్లా గిద్దలూరులోని స్వామి రంగారెడ్డి పార్కులో స్త్రీలకొరకై ఏర్పాటుచేయబడిన కమ్యూనిటీ రేడియో సెట్టుకు స్విచ్ వేసి ప్రారంభోత్సవంజరిపి ప్రసంగిస్తున్న రాష్ట్ర సంక్షేమమంత్రి శ్రీ డి. సంజీవయ్య.

# చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం

ఈ సంవత్సరం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో చిన్న మొత్తాల పొదుపు ఉద్యమంద్వారా తొమ్మిది కోట్ల రూపాయలకుపైగా వసూలు చేయవలసివున్నది. ఈ లక్ష్యాన్ని సాధించడానికై రాష్ట్రంలోని అన్నిప్రాంతాలలో తీవ్రంగా ఉద్యమం నడుపబడుతున్నది.

ఈ విషయంలో పేదలూ, ధనికులూ, కార్మికులూ పారిశ్రామికులూ, అధికార్లూ, అనధికార్లూ, అంతా సహకరిస్తేనే గాని ఈ ఉద్యమం విజయవంతంకాదు హైదరాబాదు సికింద్రాబాదు నగరములలోని ప్రతి ఒక్కరి సహకారమును పొందడానికై 1957 సెప్టెంబరు 18వ తేదీన హైదరాబాదు జిల్లా కలెక్టరు ఒక సభను ఏర్పాటుచేశారు. ప్రముఖ పారిశ్రామికులు, వ్యాపారస్తులు, ప్రభుత్వ శాఖల అధిపతులు, ఇతరులు సమావేశానికి హాజరై పై లక్ష్యం సాధించాలంటే ఏమి చేయవలసిందీ తమ అభిప్రాయాలను స్పష్టంచేశారు.

సమావేశంలో రాష్ట్ర ఆర్థికమంత్రి, సహకార మంత్రి ఇద్దరూ ప్రసంగించారు ఈ ఉద్యమానికి కార్మికుల సహకారాన్ని కూడా పొందడానికై ట్రేడుయూనియన్ నాయకుల సమావేశం ఒకటి ఏర్పాటు చేయాలని ప్రతిపాదించబడింది.

సాలార్జంగు ఎస్టేట్ ట్రస్టు ప్రావిడెంట్ ఫండు మొత్తం చిన్న మొత్తాల పొదుపు పథకానికి పెట్టుబడి పెట్టగలదని సమావేశంలో ప్రకటింపబడింది.

రాష్ట్ర సహకార మంత్రి ప్రసంగిస్తూ కుటుంబంలో ప్రతి ఒక్కరూ, పురుషులూ స్త్రీలూ ఈ ఉద్యమానికి



*చిన్నమొత్తాల పొదుపు ఉద్యమ ప్రచారం నిమిత్తమై 18-9-1957 తేదీన సెక్రటరియేట్‌లో ఏర్పాటుచేయబడిన సభలో రాష్ట్ర ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి ప్రసంగించారు.*

తమ వంతు డబ్బును పెట్టుబడి పెట్టవలెనని ఉద్బోధించారు.

## పెట్టుబడి పద్ధతులు

చిన్న మొత్తాల పొదుపు ఉద్యమానికి పెట్టుబడి పెట్టవలసిన పద్ధతులు ఈ దిగువ వివరింపబడినవి. ఈ డబ్బు పంచవర్ష ప్రణాళిక అమలుకు వినియోగింపబడుతుంది :

## 1. పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు

ఎవరికైనా అవసరాలు ముందుగాచెప్పి వస్తాయా? రావు. అలాంటప్పుడు తాము పెట్టుబడి పెట్టిన అసలులోనుంచీ, దానిపై వచ్చే వడ్డీలోనుంచి డబ్బు తీసికొనే సౌకర్యం కావాలనుకున్నవారికి పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు పద్ధతి ఉచితమైనది. వయోజనులైన స్త్రీ పురుషు లందరూ తమ పేరిట పోస్టాఫీసు సేవింగ్సు అకౌంటు తెరువవచ్చు. ఇద్దరు వ్యక్తులు ఉమ్మడిగా అకౌంటు తెరువవచ్చు. మైనర్ తరఫున పెద్దవారు లేదా గార్డియన్ అకౌంటు తెరువవచ్చు. రెండు రూపాయలతో అకౌంటు తెరువవచ్చు. ఆ తరువాత ఒక్కొక్క రూపాయి కూడా అందులో జమచేస్తూ పోవచ్చు. ఒక వ్యక్తి రూ. 15,000ల వరకు, ఇద్దరు వ్యక్తులు ఉమ్మడిగా రూ. 30,000ల వరకు. డిపాజిట్ చేయవచ్చు. ఇందులో నుంచి వారానికొకసారి డబ్బు తీసుకోవచ్చు. కొన్ని పోస్టాఫీసులలోనైతే వారానికి రెండు మార్లు డబ్బు తీసుకోవచ్చు. రూ. 25 ల నుంచి రూ. 10,000 ల వరకు (ఉమ్మడి అకౌంట్లుఅయితే రూ. 20,000 ల వరకు) గల నిల్వ పైకంమీద నూటికి ఏడాదికి 2½ రూ. ల చొప్పున, రూ. 10,000 లకు పైగావున్న నిల్వమీద (ఉమ్మడి అకౌంట్లు అయితే రూ. 20,000 లకు పైగావున్న నిల్వమీద) నూటికి ఏడాదికి 2 రూ. ల చొప్పున వడ్డీ చెల్లించబడుతుంది. ఈ వడ్డీపై ఆదాయపు పన్ను, సూపర్ టాక్సు వుండవు. మొత్తం ఆదాయంపై ఆదాయపుపన్ను రేటును నిర్ణయించునప్పుడు ఇది లెక్కలోకి తీసుకోబడదు.

## 2. 12 - ఏండ్ల నేషనల్ ప్లాను సేవింగ్సు సర్టిఫికెట్టు

సేవింగ్సు బ్యాంకు పనిని నిర్వర్తించే ఏ పోస్టాఫీసులోనైనా ఈ సర్టిఫికెట్లను కొనవచ్చు. తమ పెట్టుబడి డబ్బు, దానిపై వొచ్చే వడ్డీకొరకు కొంత కాలం వేచి వుండగలవారికి ఇవి అనువైనవి. ఇవి 5 రూ, 10 రూ, 50 రూ, 100 రూ, 500 రూ, 1000 రూ, 5000 రూ, లవి లభిస్తాయి

పరిమితి : ఒకవ్యక్తి తనపేరిట లేక పెద్దవారు మైనర్లతరఫున వీటిని గరిష్ఠం రూ. 25,000 ల వరకు (పోస్టాఫీసు క్యాష్ సర్టిఫికెట్లు, నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు ఏవైనావుంటే అవికూడా కలుపుకొని) కొనవచ్చు. మైనర్లతరఫున సర్టిఫికెట్లు కొనునప్పుడు ఆ సర్టిఫికెట్లను ఎవరు క్యాష్‌చేసి నగదుసొమ్ము తీసుకోవచ్చో వారిపేరుకూడా వ్రాయవలెను. అలా నగదుసొమ్మును తీసుకొనడానికి తండ్రిపేరుగాని లేక తల్లిపేరుగాని లేక వారిద్దరిలో ఏ ఒక్కరినైనాగాని లేదా తాత (తండ్రియొక్క తండ్రి) పేరుగాని లేదా మైనరుతరపు గార్డియన్ పేరుగాని వ్రాయవలెను. వ్రాయను చదువను తెలిసిన మైనర్లు తమపేరిట ఈ సర్టిఫికెట్లను తీసుకోవచ్చు. ఇద్దరు వయోజనులు ఉమ్మడిగా తమ పేర్లమీద రూ 50,000 ల వరకు తీసుకోవచ్చు. ఆ డబ్బు వారిద్దరికిగాని లేదా వారిలో ఎవరు బ్రతికివుంటే వారికిగాని తిరిగి చెల్లింపబడుతుంది.

మత ధార్మికసంస్థలు, విద్యాసంస్థలు, సహకార సంఘాలు, రిజిస్టరు చేయబడిన వ్యాపారసంస్థలు, స్థానిక స్వపరిపాలనా సంస్థలు ఇంకా ఎక్కువ మొత్తాలు పెట్టుబడి పెట్టవచ్చు.

సర్టిఫికెటును కొని ఒక సంవత్సరం గడచిన మీదట ఎప్పుడైనా దాన్నిఇచ్చి నగదుసొమ్ము తీసుకోవచ్చు. నూరురూపాయల విలువగల సర్టిఫికెట్టు ఏండ్లు గడిచేకొద్దీ ఈ దిగువవిధంగా రొక్కపు మారకం విలువగలిగి ఉంటుంది :

| | | |
|---|---|---|
| ఏడాది తరువాత | — | 100.00 |
| 2 ఏండ్ల తరువాత | — | 104 00 |
| 3 ,, ,, | — | 107.00 |
| 4 ,, ,, | — | 111.00 |

| | | | | |
|---|---|---|---|---|
| 5 | ,, | ,, | — | 116.00 |
| 6 | ,, | ,, | — | 121.50 |
| 7 | ,, | ,, | — | 127.00 |
| 8 | ,, | ,, | — | 133.00 |
| 9 | ,, | ,, | — | 140.00 |
| 10 | ,, | ,, | — | 148.00 |
| 11 | ,, | ,, | — | 156.00 |
| 12 | ,, | ,, | — | 165 00 |

అయితే పూర్తి గడువు ' గడచినమీదట వీటిపై నూటికి ఏడాదికి రూ. 5.4 శతిచొప్పున వడ్డీ ఇవ్వ బడుతుంది. అంటే నూరు రూపాయలు 12 ఏండ్లలో 165 రూ. లు అవుతాయి. వడ్డీపై ఆదాయపు పన్నుగాన్ని, సూపర్ టాక్సుగాని లేవు. మొత్తం ఆదాయంపై ఆదాయ పన్నురేటును నిర్ణయించు నప్పుడు ఇది లెక్కలోకి తీసుకోబడదు.

సేవింగ్సు స్టాంపులు : ఒక్కసారే 5 రూ. ల సర్టిఫికెట్టు కొనలేనివారి సౌకర్యం కొరకూ, పిల్ల లలో పొదుపు అలవాటును పెంపొందించే నిమి త్తమూ 25 నయాపైసాలవి, 50 నయాపైసాలవి, 1 రూపాయవి సేవింగ్సు స్టాంపులు పోస్టాఫీసుసులలో అమ్మబడుతాయి. ఇవి సేవింగ్సు కార్డుమీద అంటించ బడుతాయి. ఆ కార్డును పోస్టాఫీసునుంచి ఉచితంగా పొందవచ్చు. కార్డుపై అంటించిన స్టాంపుల మొత్తం విలువ రూ 5, లేక రూ 10 అయిందంటే అప్పుడు దాన్ని ఇచ్చి ఆ మొత్తానికి సమానమైన నేషనల్ ప్లాన్ సేవింగ్సు సర్టిఫికెటు తీసుకోవచ్చు.

నగదు జమానతుకు బదులుగా ఈ సర్టిఫికెట్లను ప్రభుత్వ గెజిటెడ్ ఉద్యోగులకు వారి అధికార హోదాలోనూ, ఇండియా రిజర్వు బ్యాంకుకూ, రీహాబిలిటేషన్ ఫైనాన్సు ఎడ్మినిస్ట్రేషన్‌కూ, లేదా స్థానిక పరిపాలనా సంస్థకూ తాకట్టు పెట్టొచ్చు.

## గిఫ్టు కూపనులు :

పెండ్లిండ్లు, జన్మదినోత్సవాలు, ఇతర శుభ కార్యాల సందర్భంలో సేవింగ్సు సర్టిఫికెట్లను బహు మతిగా ఇచ్చే లేదా చదివించే అలవాటును పెంపొం దింప జేయడానికై ఇటీవలనే "గిఫ్టు కూపనుల పథకం" ప్రవేశపెట్టబడింది. వీటిని మంచి అందమైన కవర్లలో పెట్టి బహూకరించవచ్చు. వీటిని సమాన మొత్తపు 12 - ఏండ్ల నేషనల్ ప్లాన్ సేవింగ్సు సర్టిఫికెట్లలోకి కూడా మార్చుకోవచ్చు. ఈ కూపనుల వల్ల శుభకార్యాల సందర్భంలో దుబారా ఖర్చు చేసే రివాజు తగ్గిపోతుంది. అలాంటి దుబారా ఖర్చు సంఘానికి గాని లేక వ్యక్తికిగాని మంచిదికాదు. సేవింగ్సు బ్యాంకు పనిని నిర్వర్తించే ఏపోస్టాఫీసులో నైనా 5 రూ, 10 రూ, 50 రూ, 100 రూ, 1000 రూ. లవి గిఫ్టు కూపనులు కొనవచ్చు.

## 3. 10-ఏండ్ల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు

తమ అసలుపెట్టుబడిని కొన్నేండ్లు అలాగేవుంచి దానిపై ప్రతిసంవత్సరం వచ్చే వడ్డీనిమాత్రం తీసుకో దలచినవారికి ఈ సర్టిఫికెట్లు మంచివి.. ఇవి నూరు రూపాయలవి, అంతకు కొన్నిరెట్లవి లభిస్తాయి. ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకు వీటికి పెట్టుబడి పెట్టొచ్చు. సంస్థలూ, ఇద్దరువ్యక్తులు ఉమ్మడిగా వీటిని రూ. 50,000 ల వరకు తీసుకో వచ్చు. ధార్మికసంస్థలు రూ. 1,00,000 ల వరకు వీటికి పెట్టుబడి పెట్టొచ్చు.

ఈ సర్టిఫికెట్లను కలకత్తా, బొంబాయి, మద్రాసు, ఢిల్లీ, హైదరాబాదు నగరాలలో వి ఇండియా రిజర్వు బ్యాంకులలోను, బ్యాంక్ ఆఫ్ మైసూరు లిమిటెడ్ లోను, ఇండియా రిజర్వుబ్యాంకు కార్యాలయంగాని, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా యొక్క శాఖగాని, స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాదు శాఖగాని, బ్యాంకు ఆఫ్ మైసూరు లిమిటెడ్ శాఖ గాని లేనిచోట్ల అయితే ట్రెజరీలలోను, సబ్ ట్రెజరీలలోను కొనవచ్చు. ఇతర స్థలములలో నివ సించు వ్యక్తులు తమ దరఖాస్తులను డిపాజిట్ మొత్తపు డ్రాఫ్టుతోసహా తమకు దగ్గరలోవున్న ట్రెజరీకిగాని లేక సబ్ ట్రెజరీకిగాని, లేక బ్యాంకు యొక్క శాఖకుగాని రిజిష్టరు పోస్టుద్వారా పంప వచ్చు.

తల్లిదండ్రులు మైనర్లుఅయిన తమ పిల్లలపేరిట డిపాజిట్ చేయవచ్చు. అలాంటి సందర్భాలలో గార్డియన్‌షిప్ సర్టిఫికెటును దాఖలు చేయనక్కర లేదు. పిల్లలు మైనర్లుగా వున్నంతవరకు పెట్టు బడిపై వచ్చేవడ్డీని తల్లిగాని లేక తండ్రిగాని, ఎవరు

దరఖాస్తుపై సంతకం పెడితే వారు తీసుకోవచ్చు. డిపాజిట్ సర్టిఫికెటు డిశ్చార్జీ విలువనుకూడా వారు తీసుకోవచ్చు. చట్టబద్ధమైన గార్డియన్ కూడా మైనర్ తరపున డిపాజిట్ చెయ్యొచ్చు.

ఈ డిపాజిట్ల అసలుసొమ్ము, డబ్బు డిపాజిట్ చేసినతేదీనుంచి పది సంవత్సరాలు పూర్తిఅయిన మీదట తిరిగి చెల్లింపబడుతుంది. ఒక వేళ ముందుగానే డబ్బును తీసుకోదలిస్తే ఒక సంవత్సరం గడచినమీదట ఎప్పుడైనా తీసుకోవచ్చు. పదేళ్ళు పూర్తికాక మునుపే డబ్బు తీసుకొంటే ఈ దిగువరేట్ల ప్రకారం డిస్కౌంటు చార్జి చేయబడుతుంది.

| | |
|---|---|
| ఒక ఏడాది తరువాతా, రెండేండ్లు గడిచే లోపలా డిపాజిట్ వాపసు తీసుకొంటే ప్రతి నూరు రూపాయలకు డిస్కౌంటు | 4.00 |
| రెండేండ్ల తరువాతా, మూడేండ్లు గడిచే లోపలా డిపాజిట్ వాపసు తీసుకొంటే ప్రతి నూరు రూపాయలకు డిస్కౌంటు | 4.50 |
| మూడేండ్ల తరువాతా, నాలుగేండ్లు గడిచే లోపలా డిపాజిట్ వాపసు తీసుకొంటే ప్రతి నూరు రూపాయలకు డిస్కౌంటు | 6.00 |
| నాలుగేళ్ళ తరువాతా, అయిదేళ్ళు గడిచే లోపలా డిపాజిట్ వాపసు తీసుకొంటే ప్రతి నూరు రూపాయలకు డిస్కౌంటు | 6.00 |
| అయిదేళ్ళ తరువాతా, ఆరేళ్ళు గడిచే లోపలా డిపాజిట్ వాపసు తీసుకొంటే ప్రతి నూరు రూపాయలకు డిస్కౌంటు | 6.25 |
| ఆరేళ్ళ తరువాతా, ఏడేళ్ళు గడిచే లోపలా డిపాజిట్ వాపసు తీసుకుంటే ప్రతి నూరు రూపాయలకు డిస్కౌంటు | 6.00 |
| ఏడేళ్ళ తరువాతా, ఎనిమిదేళ్ళ లోపలా డిపాజిట్ వాపసు తీసుకొంటే ప్రతి నూరు రూపాయలకు డిస్కౌంటు | 5.25 |
| ఎనిమిదేళ్ళ తరువాతా, తొమ్మిదేళ్ళ లోపలా డిపాజిట్ వాపసు తీసుకొంటే ప్రతి నూరు రూపాయలకు డిస్కౌంటు | 4.00 |
| తొమ్మిదేళ్ళ తరువాతా, పదేళ్ళ లోపలా డిపాజిట్ వాపసు తీసుకొంటే ప్రతి నూరు రూపాయలకు డిస్కౌంటు | 2.25 |
| పదేళ్ళు పూర్తి అయితే | డిస్కౌంటు లేదు. |

ఈ డిస్కౌంటు మొదటి సంవత్సరంలో పూర్తి వడ్డీ రేటుకు, ఆ తరువాత సంవత్సరాలలో డిపాజిటుదారు ఇదివరకే తీసేసుకొన్నట్టి వడ్డీలో కొంత భాగానికి సమానమై వుంటుంది. ఉదాహరణకు నూరు రూపాయల డిపాజిట్టును ఏడేండ్ల గడువు పూర్తిఅయి ఎనిమిదవ ఏడు గడచిపోకమునుపు వాపసు తీసుకొంటే డిపాజిటుదారు డిస్కౌంటు రూపంగా రూ. 5.25 లను తిరిగి చెల్లించవలసి వుంటుంది.. అయితే అతడు అదివరకే ఆ కాలానికి $7 \times 4 = 28$ రూ. ల వడ్డీ తీసుకున్నాడు కాబట్టి డిస్కౌంటు పోగా $(28 - 5.25)$ అతనికి రూ. 22.75 లు వడ్డీ మిగిలి వుంటుంది. అంటే నూటికి ఏడాదికి 3.25 వంతుల చొప్పున అప్పుడు వడ్డీ అతనికి లభిస్తుందన్న మాట. ఈ విధంగా నికరాదాయం ఆ యేటికాయేటికీ పెరుగుతూ పోతూ వుంటుంది. చివరకు పదేళ్ళు గడచినమీదట నూటికి ఏడాదికి 4 వంతుల చొప్పున వడ్డీ గిడుతుంది. అసలు పెట్టుబడి సొమ్ము చెక్కు చెదరకుండా వుంటుంది.

ఈ సర్టిఫికెట్లను నిర్దిష్టంగా జమానతు నిమిత్తమై గెజిటెడ్ గవర్నమెంటు ఆఫీసరుకుగాని లేదా స్థానిక స్వపరిపాలనా సంస్థ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుకుగాని, రిజర్వుబ్యాంకు ఆఫ్ ఇండియాకుగానిలేక షెడ్యూల్డు బ్యాంకుకుగాని లేదా కోఆపరేటివ్ బ్యాంకుకుగాని' లేదా సహకార సంఘానికి గాని మార్పిడి చేయవచ్చు.

డిపాజిటుదారుకు ఏడాదికి 4 శతి చొప్పున వడ్డీ ప్రతియేటా చెల్లింపబడుతుంది. ఈ వడ్డీని తన పేరిట గాని లేక తన బ్యాంకర్ల పేరిటగాని జమ కట్టించుకోవచ్చు. అలా జమ కట్టించే సందర్భంలో పబ్లిక్ డెట్ ఆఫీసుకు ఏమైనా రెమిటెన్సు చార్జీలు తగిలినట్లయితే అవి డిపాజిట్ దారువద్దనుంచి మినహాయించబడుతాయి. డిపాజిట్ దారు తన వడ్డీ సొమ్మును ఎట్టి చార్జీ లేకుండా పోస్టాఫీసులోని తన సేవింగ్సు బ్యాంకు అకౌంటుకు జమ కట్టించుకోవచ్చు. ఈ వడ్డీపై ఆదాయపు పన్నుగాని సూపర్ టాక్సు గాని విధింపబడదు. మొత్తం ఆదాయంపై ఆదాయపు పన్ను రేటును నిర్ణయించు నప్పుడు ఇది లెక్కలోకి తీసుకోబడదు.

## 4. 15-ఏండ్ల ఆన్యూటీ సర్టిఫికెట్లు

ఈ సర్టిఫికెట్లవల్ల డిపాజిట్ దారుకు అతని వృద్ధాప్యంలోనూ, లేక అతని ఆశ్రితులకూ క్రమం తప్పకుండా ప్రతినెలా సొమ్ము ముట్టుతుంది. ఈ సర్టిఫికెట్లకు పెట్టుబడి పెట్టబడినసొమ్ము నూటికి ఏడాదికి దాదాపు 3½ చక్రవడ్డీచొప్పున 15 ఏండ్ల కాలంలో నెలసరి చెల్లింపుల రూపంగా తిరిగి చెల్లింపబడుతుంది.

జారీచేయబడు సర్టిఫికెట్లు: రూ. 3500, రూ. 7,000, రూ. 14,000, రూ. 28,000. వీటిపై డిపాజిటుదారుకు పదిహేనేండ్లవరకూ ప్రతినెలా వరుసవారీగా రూ. 25, రూ. 50 రూ 100 రూ. 200 ముట్టుతాయి. పెట్టుబడి పెట్టినతేదీ నుంచి ఒక క్యాలండర్ నెల గడచినమీదట నెలసరి చెల్లింపు మొదలవుతుంది.

ప్రతినెలా డిపాజిట్ దారుకు చెల్లింపబడే సొమ్ముపై ఆదాయపుపన్ను, సూపర్ టాక్సు వుండదు. ఆదాయపుపన్ను నిమిత్తం మొత్తం ఆదాయాన్ని లెక్కకట్టేటప్పుడు కూడా ఇది లెక్కలోకి తీసుకోబడదు.

నెలసరి చెల్లింపును జమ్మూ కాశ్మీరురాష్ట్రంలో తప్ప మిగతా భారతదేశంలో ఏదేని ట్రెజరీనుంచి గాని లేదా సబ్ ట్రెజరీనుంచిగాని, లేదా బొంబాయి కలకత్తా, కొత్తఢిల్లీ మద్రాసు, బెంగుళూరు నగరాలలోని పబ్లిక్ డెట్ కార్యాలయాలనుంచిగాని తీసుకోవచ్చు. డిపాజిట్ దారు తన ఆన్యూటీసర్టిఫికెటును ఏ పబ్లిక్ డెట్ కార్యాలయంలోనైనా పదిలపరచుకోవచ్చు. అట్టి సందర్భంలో నెలసరి చెల్లింపు డిపాజిటుదారుకుగాని లేదా అతని బ్యాంకర్లకు గాని, లేదా అతని అకౌంటువున్న పోస్టాఫీసుకు గాని అతని అకౌంటులో జమకట్టే నిమిత్తం పంపబడుతుంది.

ఆన్యూటీ సర్టిఫికెటు మొత్తం గడువు పూర్తి కాకమునుపే ఆ సర్టిఫికెటుగల వ్యక్తి చనిపోయినట్లయితే మిగిలిన కాలమునకు నెలసరి చెల్లింపు చట్టబద్ధంగా అతనికి వారసుడైన వ్యక్తికి ఇవ్వడమవుతుంది. ఒకవేళ ఆన్యూటీ సర్టిఫికెటు ఇద్దరు వ్యక్తుల మధ్య ఉమ్మడిగా వున్నట్లయితే బ్రతికి వున్నవారికి నెలసరి చెల్లింపు చేయడమవుతుంది. అంతేగాని ఎట్టి పరిస్థితిలోను పెట్టుబడి శేషం ఏకమొత్తంగా వాపసు చేయబడదు.

ఈ సర్టిఫికెటును పెద్దవారు తమ పేరిట కొనవచ్చును. ఇద్దరు వ్యక్తులు ఉమ్మడిగా కూడా తీసుకోవచ్చు. మైనర్ల తరపున వారి సంరక్షకులు కొనవచ్చు. ఇద్దరు వ్యక్తులు ఉమ్మడిగా ఈ సర్టిఫికెట్లను కొన్నట్లయితే వారికి ఆన్యూటీ ఉమ్మడిగా చెల్లింపబడుతుంది, లేదా జీవించివున్న వారికి చెల్లింపబడుతుంది.

సర్టిఫికెట్లకు పెట్టుబడి పెట్టడానికి గరిష్ఠ పరిమితి ఇది :-

| | |
|---|---|
| ఒక వయోజనుడు ... | రూ. 28,000 |
| ఇద్దరు వయోజనులు ఉమ్మడిగా... | రూ. 56,000 |
| మైనరు తరపున సంరక్షకుడు ... | రూ. 28,000 |

15-ఏండ్ల ఆన్యూటీ సర్టిఫికెట్ల కొరకై పెట్టుకోబడు దరఖాస్తులు ఈ క్రింది కార్యాలయాలలో స్వీకరించబడును :

1. బొంబాయి, కలకత్తా, కొత్తఢిల్లీ, మద్రాసు, బెంగుళూరు నగరాలలోని ఇండియా రిజర్వుబ్యాంకు కార్యాలయాలు.
2. స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాదు శాఖలు.
3. మైసూరు, షిమోగా, మాండ్యా, చిక్ మగలూరు, చితల్ దుర్గ, టుమ్కూరు, హాసన్ పట్టణాలలో గల బ్యాంక్ ఆఫ్ మైసూరు లిమిటెడ్ శాఖలు.
4. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాయొక్క శాఖగాని, స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాదు శాఖగాని, బ్యాంక్ ఆఫ్ మైసూరు లిమిటెడ్ శాఖగాని. లేనిచోట్ల ప్రభుత్వ ట్రెజరీ వ్యవహారాలను నిర్వహించే భారతదేశపు ట్రెజరీలు, సబ్ ట్రెజరీలు (జమ్మూ కాశ్మీర్ ప్రాంతం మినహా.)

భారతప్రభుత్వ చిన్న మొత్తాల పొదుపు ఉద్యమ సంస్థ పెట్టుబడి పెట్టదలచుకున్నవారికి సహాయపడుటకు సిద్ధంగా వున్నది. ఈ సంస్థ ప్రధాన కార్యాలయం రైల్వేబోర్డు బిల్డింగ్, సిమ్లా-3లో వుంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో దీని ప్రాంతీయ కార్యాలయం చిరునామా ఇది: బేగంఖాదర్ యార్జంగ్ బిల్డింగ్సు, నెం. 10-2-2, ఎ. సి. గార్డ్సురోడ్, హైద్రాబాదు-4.

# అభివృద్ధి బ్లాకులలో జరుగుతున్న కృషి

## $2\frac{1}{2}$ లక్షల కుటుంబాలకు అభివృద్ధి కార్యక్రమాలవల్ల మేలు

1957 ఆగస్టు నెలలో దాదాపు 151 బ్లాకులలో జరిగిన కృషిని ప్లానింగు అభివృద్ధి శాఖ తమ నివేదికలద్వారా వివరించింది. ఆ నివేదికలను పరిశీలించితే సామాజికాభివృద్ధి కార్యక్రమం వల్ల 2,63, 551 కుటుంబాలకు మేలు కలిగినట్లు తెలుస్తున్నది. సహకారసంస్థల సౌకర్యం 18,175 కుటుంబాలకు కలుగజేయ బడింది.

ప్రజలు నగదు రూపంలోను, వస్తు రూపంలోను, కాయకష్టం రూపంలోను రూ. 6,47,250 ల మేరకు సహాయం చేశారు. ఈ నెలలో ప్రభుత్వం ఈ కార్య కలాపాలకు రూ 13,16,144 లు ఖర్చు పెట్టింది

వివిధ అభివృద్ధి బ్లాకుల కార్యకలాపాలు ఈ దిగువ వివరింపబడినవి :

### సామాజికాభివృద్ధి బ్లాకులు

రాష్ట్రంలోని సామాజికాభివృద్ధి బ్లాకులలో 60,793 మణుగుల మేలిరకం విత్తనాలు పంపిణీ చేయబడ్డవి. 1,08,039 మణుగుల రసాయనిక ఎరువులు, 3,322 కొత్తరకం వ్యవసాయ పనిముట్లు పంచిపెట్టబడ్డవి. 60,909 ఎరు గుంటలు, 6041 కంపోస్టు గుంటలు త్రవ్వడినవి. 31,048 పెరటి తోటలు వేయబడ్డవి. పండ్లమొక్కలు, ఇతర మొక్కలు మొత్తం 8,85,130 మొక్కలు నాటబడ్డవి. 3,497·75 ఎకరాల విస్తీర్ణంలో విత్తనాల క్షేత్రాలు నెలకొల్పబడ్డవి. 3,971·81 ఎకరాలలో జపాను పద్ధతి వరిసేద్యం చేయబడింది. 2869·57 ఎకరాలలో పండ్లతోటలు 5742-14 ఎకరాలలో కూరగాయల తోటలు వేయబడ్డవి.

3020-65 ఎకరాల భూమికి సాగునీరు లభింపజేయబడింది. 3366 ఎకరాల భూమిని సాగుకు లాయకు చేయడమైనది.

4695 గిత్తలకు విత్తులు కొట్టబడ్డవి. సంతానాభివృద్ధి కోసం 47 జంతువులు, 1,374 పశులు సప్లయి చేయబడ్డవి.

గ్రామాల పారిశుధ్య కార్యక్రమంలో ఒక భాగంగా 1,108 పొగరాని పొయ్యిలు, 910 మరుగుదొడ్లు, 46,281 గజముల మురుగుకాల్వలు ఏర్పాటు చేయబడ్డవి. త్రాగే మంచినీటిబావుల నిర్మాణం, మరమ్మతు కూడా జరుపబడింది. కొత్తగా 76 బావులు త్రవ్వబడ్డవి. 443 పాతబావులు మరమ్మతు చేయబడ్డవి.

కొత్తగా 33 పాఠశాలలు తెరువబడ్డవి. 61 పాఠశాలలను బేసిక్‌స్కూళ్ళుగా మార్చనైనది. 264 ప్రజాసంస్థలు అభివృద్ధి పరచబడ్డవి. 132 సామాజిక కేంద్రాలు ప్రారంభింప బడ్డవి. ఈ నెలలో 1330 మంది వయోజనులకు శిక్షణ గరపబడింది. 83 వయోజన అక్షరాస్య కేంద్రాలు స్థాపించబడ్డవి.

రాకపోకల పద్దుకింద 101 మైళ్ళ పక్కారోడ్లు 42 మైళ్ళ కచ్చారోడ్లు నిర్మింపబడ్డవి. 51 మైళ్ళ కచ్చారోడ్లు మరమ్మతు చేయబడ్డవి.

ఈ నెలలో కొత్తగా 26 సహకారసంఘాలు ప్రారంభింపబడ్డవి. అదనంగా 3974 మందిని సహకార రంగంలోకి తేవడమైనది.

4,514 హుండీ పెట్టెలను సరఫరాచేసి గ్రామాలలో పొదుపుఉద్యమం ప్రచారం చేయబడింది. 1957 జులై నెలలో రూ. 17,291 లు చిన్న మొత్తాల పొదుపు ఉద్యమంద్వారా వసూలు చేయబడ్డవి.

### జాతీయ విస్తరణ సేవాకేంద్రాలు

రాష్ట్రంలోని జాతీయ విస్తరణ సేవాకేంద్రాలలో 66,309 మణుగుల మేలిరకం విత్తనాలు, 1,45,036 మణుగుల రసాయనిక ఎరువులు

పంచిపెట్టబడ్డవి. ఈ నెలలో 44,767 ప్రదర్శనలు కూడా జరుపబడ్డవి. కూరగాయల సేద్యంక్రిందికి 5959 ఎకరాలు, పండ్లతోటల సేద్యంక్రిందికి 1010 ఎకరాలు తేబడ్డవి 29,372 ఎకరాలలో జపానుపద్ధతి వరిసేద్యం ప్రవేశపెట్టబడింది. 10,483 ఎరువుగుంటలు, 7,238 కంపోస్టు గుంటలు త్రవ్వబడ్డవి. 51,941 పెరటితోటలు వెయ్యబడ్డవి. కొత్తరకం పనిముట్లు 6,295 పంచిపెట్టబడ్డవి.

మాగాణి సేద్యంక్రిందికి 8,421 ఎకరాల భూమి తేబడింది. 12,355 ఎకరాల భూమిని బాగుపరచి సాగుకు లాయకుచేయకమైనది.

త్రాగే మంచినీటిబావులు 55, మరుగుదొడ్లు 850, పొగరాని పొయ్యిలు 1059 నిర్మింపబడ్డవి. 370 పాతబావులు మరమ్మతు చేయబడ్డవి. 54,283 గజముల పొడవున మురుగుకాలువలు ఏర్పాటు చేయబడ్డవి.

కొత్తగా 13 పాఠశాలలు ప్రారంభింపబడ్డవి. 70 పాతపాఠశాలలు బేసిక్‌స్కూళ్ళుగా మార్చబడ్డవి. 422 ప్రజాసంస్థలు అభివృద్ధి పరచబడ్డవి. ఒక్క ఆంధ్రప్రాంతంలోనే 166 సామాజిక కేంద్రాలు తెరువబడ్డవి. 75 వయోజన అక్షరాస్యత కేంద్రాలు ప్రారంభింపబడ్డవి. వాటిలో 1395 మంది వయోజనులకు శిక్షణ ఇవ్వబడింది.

16 మైళ్ళ పక్కారోడ్లు, 50 మైళ్ల కచ్చారోడ్లు వేయబడ్డవి.

కొత్తగా 62 సహకారసంఘాలు స్థాపించబడ్డవి. వీటి సభ్యత్వం 6869.

ప్రజలలో పొదుపును అలవాటు చేయడానికై 2,130 హుండీపెట్టెలు పంపిణీ చేయబడ్డవి. చిన్న మొత్తాల పొదుపుఉద్యమం రూపంగా రూ. 40,621 లు వసూలు చెయ్యబడ్డవి. ఇందులో ప్రభుత్వేతర సంస్థలు వసూలు చేసిన మొత్తం రూ. 2,912 లు.

## అనంతర తీవ్రకృషి బ్లాకులు

రాష్ట్రంలో 22 అనంతర తీవ్రకృషి బ్లాకులున్నవి. వీటిలో 1957 జులై నెలలో 2,71,88 మణుగుల మేలిరకం విత్తనాలు, 1,28,087 మణుగుల రసాయనిక ఎరువులు, 1097 కొత్త రకం పనిముట్లు పంపిణీ చేయబడ్డవి. 17,465 వ్యవసాయ ప్రదర్శనలు జరుపబడ్డవి. 17,854 పెరటితోటలు వేయబడినవి. 34,829 ఎకరాల విస్తీర్ణంలో జపానుపద్ధతి వరిసాగు ప్రవేశ పెట్టబడింది. అదనంగా 2417 ఎకరాలభూమి సాగునీటి పారుదలక్రిందికి తేబడింది. 2385 ఎకరాల భూమి సాగుకు లాయకు చేయబడింది.

త్రాగే మంచినీటిబావులు 41 నిర్మింపబడ్డవి. 48 పాతబావులు మరమ్మతు చేయబడ్డవి, 295 మరుగుదొడ్లు ఏర్పాటు చేయబడ్డవి. ఆంధ్ర ప్రాంతంలో 19,493 గజముల పొడవున మురుగు కాలువలు త్రవ్వబడ్డవి.

కొత్తగా ఒక పాఠశాల స్థాపించబడింది. 45 సాధారణ పాఠశాలలు బేసిక్‌స్కూళ్ళుగా మార్చబడ్డవి. 168 ప్రజాసంస్థలు ప్రారంభింప బడ్డవి. 44 సామాజికకేంద్రాలు, 22 వయోజన అక్షరాస్యతా కేంద్రాలు నెలకొల్పబడ్డవి. 491 మంది వయోజనులకు శిక్షణ ఇవ్వబడింది.

కొత్తగా 5 సహకార సంఘాలు ప్రారంభింపబడ్డవి. సహకారసంఘాల సభ్యత్వం 2398 వరకు హెచ్చింది.

పొదుపు ఉద్యమాన్ని వ్యాప్తం చేయడానికై 1405 హుండీపెట్టెలు పంపిణీ చేయబడ్డవి. చిన్న మొత్తాల పొదుపురూపంలో రూ. 95,259 లు వసూలు చేయబడ్డవి.

## బహుళార్థ సాధక ప్రాజెక్టులు

రాష్ట్రంలోని నాలుగు బహుళార్థ సాధక ప్రాజెక్టులు ఈ నెలలో 1061 మణుగుల మేలిరకం విత్తనాలు, 911 మణుగుల రసాయనిక ఎరువులను పంచిపెట్టినవి. 525 ఎకరాల విస్తీర్ణంలో జపాను పద్ధతి వరిసాగు ప్రవేశ పెట్టబడింది.

260 ఎకరాలభూమి నీటిపారుదల క్రిందికి తేబడింది. 529 ఎకరాలభూమి సాగుకు లాయకు చేయబడింది.

త్రాగే మంచినీటి బావులు 7 నిర్మింపబడ్డవి. 12 పాత బావులు మరమ్మతు చేయబడ్డవి. 160 మురుగు నీటిగుంటలు త్రవ్వ బడ్డవి. 53 మరుగు

దొడ్లు ఏర్పాటు చేయబడ్డవి. 879 గజముల పొడవున మురుగు కాల్వలు ఏర్పాటు చేయబడ్డవి.

నర్సంపేటలో కొత్తగా ఒక సహకార సంఘం ప్రారంభింప బడింది. ప్రాజెక్టు ల్నింటిలో కొత్తగా 210 మంది సభ్యులు చేర్చబడ్డారు.

పొదుపు ఉద్యమం నిమిత్తం 50 హుండీపెట్టెలు పంచిపెట్ట బడ్డవి. చిన్న మొత్తాల పొదుపు క్రింద రూ 2000 లు వసూలు చేయబడ్డవి.

## శిక్షణ

ఉట్నూరు బహుళార్థసాధక ప్రాజెక్టు కేంద్రమైన ఉట్నూరులో ఆగస్టు 30 తేదీన అదిలాబాదు జిల్లా కలెక్టరు గ్రామ నాయకుల శిక్షణ శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ శిబిరం ప్రత్యేకంగా రెండు రోజులపాటు నిర్వహింప బడింది. ఇది వ్యవసాయ తరగతులవారి కొరకు ఉద్దేశించ బడింది. స్థానిక నాయకత్వాన్ని గూర్చి సామాజికాభివృద్ధి కార్యక్రమం వల్ల కలిగే మేలును గూర్చి ఉపన్యాసాలివ్వ బడ్డవి. శిబిరంలో ప్రసంగాలు, ప్రదర్శనలు సినిమా ప్రదర్శనలు వ్యవసాయ పశు సంరక్షణ ప్రదర్శనం ఏర్పాటు చేయ బడ్డవి.

44 మంది గ్రామస్తులు ఈ శిబిరానికి హాజరయ్యారు. వారిలో పంచాయితీదార్లు అభ్యుదయ కాముకులైన రైతులు, హరిజనులు, గిరి జనులు వున్నారు.

ఆగస్టు నెలలో గుంటూరు జిల్లాలో గ్రామ నాయకుల శిక్షణ శిబిరాలు రెండు నిర్వహింపబడ్డవి. వీనిలో మొదటిది, సత్తెనపల్లి తాలూకా క్రోసూరు గ్రామంలో ఆగస్టు 12వ తేదీనుంచి 6 రోజులపాటు నిర్వహింప బడింది. ప్రసంగాలద్వారా ప్రదర్శనల ద్వారా గ్రామీణ జీవితంలోని అనేక విషయాలను గూర్చి 50 మంది గ్రామస్తులకు శిక్షణ గరపబడింది. ప్రతిరోజు శ్రమదానం, వైజ్ఞానిక ప్రదర్శలు వుండేవి. ఈ శిబిరం రాజుపాలెం జాతీయ విస్తరణ సేవా కేంద్రంచే ఏర్పాటు చేయబడింది.

రెండవ శిబిరం రేపల్లె తాలూకాలోని ధూళిపూడిలో ఎర్పాటు చేయబడింది. ఇది పాళ్ళపట్ల జాతీయవిస్తరణ సేవాకేంద్రంచే వ్యవస్థీకరింప బడింది. ఇది ఆగస్టు 5వ తేదీన ప్రారంభింపబడి ఆరు రోజులపాటు నిర్వహింప బడింది,

ప్రతిరోజు శ్రమదానం వైజ్ఞానిక కార్యక్రమాలు వుండేవి. ప్రసంగాలు, ప్రదర్శనలు ఏర్పాటుచేయ బడ్డవి. ఈ శిబిరంలో 40 మంది గ్రామస్తులు పాల్గొన్నారు.

---

* అభివృద్ధిబ్లాకులలో రాష్ట్రమంత్రులు * [39 వ పేజీ తరువాయి]

వృద్ధి కార్యక్రమంవల్ల గ్రామం పూర్తిలాభంపొందుతున్నందుకు మంత్రులు సంతసించారు, ఇక్కడ జరిగిన బహిరంగసభలో గ్రామస్తులు తమ గ్రామాన్ని ఆదర్శప్రాయంగా చేయవలెనని ఉద్బోధించారు.

12-9-1957 తేదీన మంత్రులు యెమ్మిగనూరులోని నేతపనివారి సహకార కాలనీని సందర్శించి, బ్లాకు సలహా సంఘ సమావేశంలో ప్రసంగించారు.

ముట్టుకూరులో జరిగిన బహిరంగసభలో ప్లానింగు మంత్రి ప్రసంగిస్తూ ప్రజలు కుల మత భేదాలను విస్మరించి పేదల అభ్యున్నతికై పాటుపడాలని హితవు చెప్పారు. సంఘసంక్షేమమంత్రి తమ ప్రసంగంలో కాయకష్టంయొక్క ఘనతను ఉగ్గడించి అంతా కష్టించి పని చేయవలెనన్నారు,

పర్లలో ప్లానింగుమంత్రి ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికీ, సంఘసంక్షేమ మంత్రి గ్రామీణ బ్యాంకుకూ ప్రారంభోత్సవం చేశారు. ఇచ్చట గ్రామస్తులు భారత సేవక్ సమాజ్ అధ్వర్యాన గ్రామమందిరాన్ని నిర్మించారు. గ్రామస్తులు 4 ఎకరాల స్థలం ఇచ్చినందుకూ, ప్రాథమిక ఆరోగ్యకేంద్ర నిర్మాణానికి రూ. 10,000 లు విరాళం ఇచ్చినందుకూ, గ్రామీణబ్యాంకు భవనానికి దాదాపు లక్ష రూపాయలు ఇచ్చినందుకూ మంత్రిగారు అభినందించారు. పేదరికాన్ని నిర్మూలించడానికీ, ఆర్థికాభివృద్ధిసాధించడానికీ కృషిచేయండని మంత్రులు ప్రజలను ఉద్బోధించారు.

* * *

# గ్రామీణ చేతిపరిశ్రమల కేంద్రం, పటన్ చెరువు

పటన్ చెరువు సామాజికాభివృద్ధి బ్లాకు 1955-56 సంవత్సరంలో ప్రారంభింపబడ్డ బ్లాకులలో ఒకటి. ఇటీవల ఆ ప్రాంతంలో పరిశీలన జరుపగా వివిధ కుటీర పరిశ్రమలలో పనిచేస్తున్నవారి సంఖ్యా వివరాలు తెలిశాయి. ఆ వివరాలు ఇవి

| | |
|---|---|
| చేనేతపనివారు | 499 |
| వడ్రంగం పని | 280 |
| కుమ్మరిపని | 271 |
| తోలు ఊనకంపని | 684 |
| ఉన్ని నేతపనివారు | 150 |
| కమ్మరి పనివారు | 173 |
| తాటిబెల్లం తయారీ | 26 |
| పాదరక్షల తయారీ | 124 |

ఈ కేంద్రం 1956 ఫిబ్రవరినుంచి పనిచేయడ మారంభించింది. స్టయిపండ్లు ఇచ్చి 36 మంది పనివారికీ, స్టయిపండ్లు లేకుండా 56 మంది పనివారికీ వివిధ పరిశ్రమలలో శిక్షణ ఇవ్వబడింది. వీరిలో 41 మంది స్త్రీలుకూడా వున్నారు. ఇప్పుడు స్టయిపండ్లు ఇచ్చి 13 మందికీ, స్టయిపండ్లు లేకుండా 5 గురికీ శిక్షణ ఇవ్వబడుతూ వున్నది.

శిక్షణ ఈ దిగువ పరిశ్రమలలో ఇవ్వబడుతూన్నది.

(1) నేతపని (ఉన్ని, నూలు).
(2) చర్మకారవృత్తి.
(3) తాటిబెల్లం తయారీ.

క్రొత్తగా ఈ క్రింది విభాగాలు పెట్టబడనున్నవి

(1) వడ్రంగం
(2) సబ్బుల తయారీ.

రూ. 4700 లు మంజూరుచేసి, ఈ మొత్తాన్ని శిక్షణ పొంది వృత్తి అవలంబించదలచుకున్న పనివారలకు పంచడమైనది. శిక్షణ పొందినవారినుంచి అప్పుల నిమిత్తమై 19 దరఖాస్తులు చేరాయి. వీటికికూడా త్వరలో మంజూరీ లభించగలదు.

| | |
|---|---|
| ఏర్పాటుచేయబడ్డ ప్రదర్శనలు | 62 |
| ఈ కార్యక్రమం వర్తించే గ్రామాల సంఖ్య | 30 |
| దీనివల్ల మేలుపొందిన పనివారలు | 450 |



పటన్ చెర్వు కేంద్రంలో ప్రదర్శింపబడిన వస్తువులను రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్ చూచారు.

బడ్జెటులో మొత్తం కేటాయింపు రూ. 1,25,000

జూన్ నెలాఖరు వరకు ఖర్చుపెట్టబడిన

మొత్తం రూ. 34,000

చేనేత సెస్సు నిధినుంచి ఖర్చుపెట్టబడిన

మొత్తం రూ. 24,945

పటన్‌చెరువు బ్లాకులోని ఇస్మాయిల్‌ఖాన్‌పేట చేనేత పనివారి సహకార సంఘానికి చేయబడ్డ సహాయం వివరాలు ఇవి :

| | |
|---|---|
| మగ్గాలు | 541 |
| చెల్లించబడిన వాటా మూలధనం | రూ. 14,041 |
| రిజర్వు నిధులు | రూ. 1,641 |
| ఉత్పత్తి నిమిత్తమై చేనేత సెస్సునిధినుంచి వడ్డీలేకుండా 1953-54, 54-55, 55-56 సంవత్సరాలలో అప్పులు పొందిన మగ్గముల సంఖ్య, | 162 |
| మంజూరు చేయబడ్డ అప్పు మొత్తం | రూ. 16,200 |
| ఉత్పత్తి పనిక్రిందికి తేబడ్డ మగ్గముల సంఖ్య | 162 |
| చెల్లించబడ్డ రిబేటు మొత్తం | రూ. 7,747-14-6 |

## గ్రాంటుగా ఆధునిక పరికరముల సప్లయి

38 త్రోషటల్ మగ్గాలను ఫ్లైషటల్ మగ్గాలుగా

| | |
|---|---|
| మార్చడానికి | రూ. 950 |
| డాబీలు | రూ. 48 |

ఈ సంఘమునకు స్వంత అద్దకపుశాల కలదు.

అప్పును తిరిగి చెల్లించడానికై సింకింగ్ నిధి క్రింద వసూలు చేయబడిన మొత్తం రూ. 5,270-0-0

గత మూడేండ్ల ఉత్పత్తి వివరాలు ఇవి :

| కాలం | ఉత్పత్తి (గజాలు) | అమ్మకం (గజాలు) |
|---|---|---|
| 1954 జనవరి నుంచి డిసెంబరు వరకు | 52[illegible] | 95 |
| 1955 జనవరి నుంచి డిసెంబరు వరకు | 1,56,415 | 95,796 |
| 1956 జనవరి నుంచి డిసెంబరు వరకు | 1,59,312 | 1,20,500 |

ఈ ప్రాంతంలో ఇతర పారిశ్రామిక సంస్థలు ఇవి :

1. తాటిబెల్లపు సహకార సంస్థ : రాష్ట్రీ ఖాదీ గ్రామీణ పరిశ్రమల బోర్డునుంచి ఆర్థిక సహాయం ఆశింపబడుతున్నది.
2. సహకార గ్రామీణ చర్మకారసంస్థ (నమూనాసంస్థ) : డిటో
3. కంబళ్ళ నేతపనివారి సహకారసంఘం : చేనేత సెస్సునిధినుంచి ఆర్థిక సహాయం ఆశింపబడు తున్నది.

# ముందుచూపుగల రైతు



ఆయేడు పంట బాగా పండింది. రామన్న చాలా సంతోషపడ్డాడు. పంట బాగా పండిందంటే ఎక్కువ ఆదాయం వస్తుందన్న మాట. ఖర్చుపెట్టడానికి చేతి నిండా డబ్బు వుంటుంది. మరి ఆ డబ్బుతో ఏం చెయ్యాలీ అని రామన్న ఆలోచించాడు. పొలం కొందామా, ఇల్లు కట్టుకుందామా, భార్యకు నగలు చేయిద్దామా-ఇంట్లో వాళ్ళందరికీ కొత్తబట్టలు కొంటే.

మొత్తం మీద ఏదోవిధంగా వచ్చిన డబ్బు మొత్తాన్నీ ఖర్చు పెట్టాలనే రామన్న అనుకున్నాడు. కాని ఇంతలో వెంకయ్య కలిశాడు. వెంకయ్య రామన్నకు మంచి స్నేహితుడు.

వెంకయ్య ; రామన్నా, ఈయేడు మీ పంట బాగా పండిందట్టుకుందే. రాబడి ఏమాత్రం ? ఇదుగో, ఒక మాట చెబుతున్నా విను. వచ్చిందాన్నంతా ఖర్చుపెట్టా లంటే గంటలో ఖర్చుబెట్టొచ్చు. కాని కాస్తె ముందు సంగతి ఆలోచించాలి. డబ్బు ఇవాళరోజు గడవడానికే గాక రేపటికికూడా అక్కరపడుతుందన్నమాట గుర్తుంచుకో.

రామన్న ! అయితే వెంకయ్యన్నా డబ్బు మిగల్చ మని చెబుతావు. మరి మిగిల్చి ఎక్కడని దాచను ?

వెంకయ్య : ఎక్కడ దాచేదంటావా ? అయితే ఒక సంగతి చెబుతావిను. ఈ యేడు నీకు ఎక్కువ పంట ఎట్లా పండింది? కష్టపడి పనిచెయ్యబట్టేగా, అయితే కష్టపడి పనిచేసినంతమాత్రాన్నే పండిందా ? మంచి పనిముట్లతో సేద్యంచేశావు. మంచి విత్తనాలూ, ఎరువులూ వేశావు. నీటి సప్లయికూడా బాగా అమరింది. కనుకనే తస్సదియ్యా, ఎప్పుడూ లేనంత పండింది. మరి ఒక సంగతి ఆలోచించావా ? ఇవన్నీ ఎవరు సప్లయి చేశారు? ఎవరో ? మన ప్రభుత్వం కాదా. చూడూ, ఋతువు మొదలయిన దగ్గర్నుంచీ పాపం ఆ గ్రామసేవకుడు మన చుట్టూ తిరిగాడా ? ఎక్కువ పంటపండాలంటే పొలం ఎట్టాదున్నాలో, సేద్యం ఎట్టా చెయ్యాలో చెప్పాడా ? మంచి విత్తనాలూ, ఎరువులూ సప్లయిచేసే ఏర్పాట్లు చేయించాడా? చెప్పు. ఏమాట, కామాటే. మరి ఆయనకి జీతం ఎవరిచ్చారు ? ప్రభుత్వం ఇచ్చింది. ప్రభుత్వం జీతం ఇస్తే ఆయన మనకోసం పనిచేశాడు. మరి ప్రభుత్వం మనకింత మేలుచేస్తూవుంటే, మనంకూడా ప్రభుత్వానికేమైనా సాయం చెయ్యొద్దా.

రామన్న : అవును వెంకయ్యన్నా, మనం కూడా ప్రభుత్వానికి సాయం చెయ్యాల్సిందే. కాని మనబోటి వాళ్ళం ప్రభుత్వానికేమి సాయం చెయ్యగలం ? నువ్వేంచేశావో చెప్పు.

వెంకయ్య : నేను చేసిందేమిటో చెప్పమంటావా ? నా సంపాదనలో కొంత మిగిల్చాను. అయితే ఆ మిగుల్చుకుంది నాదగ్గరే ముడుపుకట్టుకొని వుంచుకోలేదు. ప్రభుత్వానికి అప్పుపెట్టాను. అంటే ఏమిటనుకున్నావ్. ఈ మధ్య ప్రభుత్వంవారు పొదుపు ఉద్యమం ఒకటి పెట్టారు. అది ఇక్కడేకాదు. దేశమంతటా వుంది. దానికే నేను మిగుల్చుకున్న డబ్బు అప్పుగా ఇచ్చాను. నేచేసింది మంచిపనే అంటావా ? మంచో శబ్బరో, ఎప్పుడైనా అక్కర పడ్డప్పుడు ఆదుకుంటుంది.

రామన్న : పొదుపు వుద్యమం అంటే ఏమిటి వెంకయ్యన్నా ?

వెంకయ్య ; ఏమిటంటే, మన సంపాదనలోనుంచి కొంత డబ్బును వెనకేసుకోవాలని ప్రభుత్వంవారి ఉద్దేశం. మరి మనం ఎలా వెనకేసుకోగలుగుతాము ? మిగుల్చుకొన్నదాన్ని దాచుకోనేందుకు ఏదైనా వీలుండాలా ? దానికోసమే ప్రభుత్వం చిన్నమొత్తాల పొదుపు పథకంపెట్టి నేషనల్ ప్లాను సేవింగ్స్

సర్టిఫికెట్లు ఇస్తూంది. నేను ఎప్పుడూ ఆ సర్టిఫికెట్లు **ఒకటి కొంటూ వుంటాను.**

రామన్న : మరి వెంకయ్యన్నా, ఆ సర్టిఫికెట్లు ఎక్కడ దొరుకుతవి ?

వెంకయ్య: ఎక్కడో అనుకుంటున్నావేమిటి ? మన జిల్లాలో వాటికి సంబంధించిన ఆర్గనైజరు వున్నాడు. మన ఊళ్లో ఏజంటుకూడా వున్నాడు. నువ్వు మిగిల్చేడబ్బు ప్రభుత్వానికి ఎట్లా పెట్టుబడి పెట్టాలో వారిలో ఎవరైనా చెబుతారు, వారిని కలుసుకోవడం పడకపోతే పోస్టాఫీసుకెళ్ళితేసరి, అక్కడ సర్టిఫికెట్లు అమ్ముతారు. అయిదు రూపాయలవి, పది రూపాయలవి, ఏభై రూపాయలవి, నూరు రూపాయలవి, ఐదువందల రూపాయలవి, వెయ్యి రూపాయలవి, ఐదువేల రూపాయలవి నేషనల్ ప్లాన్ సేవింగ్సు సర్టిఫికెట్లు దొరుకుతవి. వాటిగడువు పన్నెండేండ్ల తరువాత పూర్తి అవుతుంది. గడువు పూర్తిఅయిన మీదట నూటికి 5.41 చొప్పున వడ్డీకూడా ఇస్తారు,

రామన్న : అయితే, వెంకయ్యన్నా, ఒక మాట. మళ్ళీ మనకు అవసరమైనప్పుడు మన డబ్బు మన కివ్వమంటే ఇస్తారా ?

వెంకయ్య : ఓ, ఇస్తారు. సర్టిఫికెట్టు కొన్న తరువాత ఏడాది దాటితే ఎప్పుడైనా మనడబ్బు మనం తీసుకోవచ్చు. కాని రామన్నా, గడువు పూర్తి అయ్యేదాకా వుంచడమే మంచిదనుకో. ఎందుకంటావా నిండువడ్డీ వస్తుంది. పదిరూపాయలుపెట్టి ఒక సర్టిఫికెట్టు కొంటే గడువు ముగిసినతరువాత పదహారు రూపాయల ఏభై నయాపైసాలిస్తారు.

**రామన్న : నరే వెంకయ్యన్నా,** ఇది బాగానే వుందిగాని ప్రభుత్వం **ఈ డబ్బు** తీసుకొని ఏంచేస్తుంది?

వెంకయ్య : అదీ అలాఅడుగు చెబుతా. ప్రభుత్వం ఇప్పుడు మనదేశాన్ని బాగుపరచి అభివృద్ధిచేయ్యడానికై పెద్ద ప్రణాళికను తలపెట్టింది. దానికి డబ్బు కావాలి. మనం ఇచ్చేడబ్బు అ ప్రణాళికకు తోడ్పడుతుంది. ఆడబ్బుతో ప్రభుత్వంవారు నదులకు ఆనకట్టలు కట్టి సాగునీరు, విద్యుచ్ఛక్తి సప్లయి చేస్తారు. స్కూళ్లు ఆసుపత్రులూపెట్టి గ్రామాలకు సౌకర్యాలు కలిగిస్తారు. మనకా అసలు ఫాయిదాలతో డబ్బు తిరిగొస్తుంది. చూచావా రెండువిధాలా మనకే లాభం కలుగుతుంది, కాబట్టి రామన్నా మనం ప్రతియేటా పంటకోతలప్పుడు కొంత డబ్బు మిగిల్చి చిన్న మొత్తాల పొదుపు పథకానికి పది రూపాయలు పెట్టుబడి పెట్టడం మంచిది. దేశంలో ఐదుకోట్ల రైతుకుటుంబాలున్నవి. వారంతా కూడా పెట్టుబడి పెట్టినట్లయితే ప్రభుత్వానికి ప్రతి ఆరు నెల్లకూ ఏభైకోట్ల రూపాయలు దొరుకుతాయి. ఆ డబ్బుతో ప్రభుత్వం మనకు కావలసిన వసతులు ఏర్పాటు చేస్తుంది. పైగా ఇది మనకు లాభసాటియైన పెట్టుబడికూడా. ఏమంటావు ?

రామన్న : చాలా మంచిసంగతి చెప్పావు వెంకయ్యన్నా, నేనుకూడా కొంత డబ్బు మిగిల్చి ఇవాళే పొదుపు పథకానికి పెట్టుబడి పెడతాను.

రామన్న పోస్టాఫీసుకెళ్లి నేషనల్ ప్లాన్ సేవింగ్సు సర్టిఫికెట్ ఒకటి కొన్నాడు. దాన్ని తీసుకెళ్లి భార్యకు చూపి సంగతంతా చెప్పాడు. ఆవిడకూడా చాలా సంతోషించింది.